వ. అనిన జటాధారిజంగమప్రమథుండు వీఁడు చిఱుతొండనంబికింటె నధికుండు వొ మ్మనుచు మరలి పోవువాఁడు వెండియు. 81

తే. కపటమాయామహానాటకప్రపంచ, సూత్రధారుండు చిఱుతొండసుతున కపుడు మూర్ఛ రప్పించె హరుఁ డందు మోసపోయి, యక్షరాచార్యుఁడును భయమందఁ దలసి.

శా. నోర న్నుచ్చిలి గ్రమ్మ మై వడఁకఁ గన్నుల్ తారకాబింబసం
చారవ్యాప్తి నధఃకరింప హృదయస్థానంబు గంపింపఁ గ్రీ
వారంధ్రంబున ఘుర్ఘురధ్వనులు తీవ్రస్ఫూర్తి వర్తింపఁగా
సీరాలుఁడు ధరిత్రి మీఁదఁ బడి మూర్ఛిల్లె న్నిరాలస్యతన్. 83

క. మోహాంధకారధారా, వ్యూహమున సిరాలుసెట్టి యును ఉడుసుటయున్
హాహాకారధ్వనితో, లాహల మచ్చోటఁ గురుకులంబునఁ జెలఁగెన్. 84

తే. ప్రణుతపంచాక్షరీమంత్రపాఠశక్తి, ఫాలమున దేశికుఁడు భూతిఁ బ్రాముటయును గ్రమ్మఱను మూర్ఛ దెలిసె సిరాలసెట్టి, భక్తులకు భస్మమే కదా ప్రాణరక్ష. 85

వ. అంత నక్కడ. 86

సీ. చిఱుతొండఁ డావృద్ధశివయోగిపుంగవుఁ, బ్రబలకుష్ఠవ్యాధిబాధితాంగు
వీఁపుమీఁద ధరించి వెనువెంట గ్రుడ్డవ్వ, కోలూఁదికొని రాఁగఁ గూర్చుకొనుచు
బూది బొక్కణ లాతమను కమండలువును, బులికళాసముఁ గరంబున వహించి
శరణీయు లెదురుగా శరణార్థి సేయుచు, నొయ్యొయ్య సందడి నోసరిలుచు

తే. చంద్రశేఖర భూతేశ శర్వ రుద్ర, పార్వతీనాథ శంకర భవ గిరీశ
కాలకంధర హర కాలకాల యనుచు, వచ్చె నింటికి జనకోటి యిచ్చగింప. 87

మ. మహి నూహింపఁగ నెంతభాగ్యమొకొ యామ్నాయాంతసిద్ధాంతవా
గ్మహిళాకుంతలమౌక్తికాభరణమున్ మందాకినీశేఖరుం
గుహనాభైరవు యోగిపుంగవుని భర్గున్ రాజమార్గంబునన్
వహియించెం దనవీఁపునం దిరముగా వైశ్యుం డనాలస్యతన్. 88

ఉ. ఇంటికిఁ దెచ్చి యోగిపరమేశునకున్ వణిజుండు, తాను వా
ల్గంటియు భక్తియున్ భయము గౌరవము న్వినయంబు నాత్మలో
నంటుకొనంగ నప్డు ముసలమ్మకు సైతము కమ్మనూనె మై
నంటి నలుంగుతో జలక మార్చి యొసంగిరి ధౌతవస్త్రముల్. 89

వ. అనంతరంబ యేకాంతగృహంబున సర్వోపచారసంభారభరితంబుగా దేవతార్చన కుం బెట్టిన నయ్యాదిమదంపతు లిరువురు శివపూజావ్యాపారంబునం బ్రవర్తిల్లుచుండి రప్పుడు శివాజ్ఞావశంబునం జేసి. 90

ఉ. పల్లియచోటనుండి యెలపాసెము నడ్కులు జక్కిలంబులున్
బెల్లపుటచ్చులున్ సెనగ బేడలుఁ జిమ్మిలి నువ్వుటుండలున్
బెల్లుగ నంబివియ్యములు పెద్దతికంబుఁ బ్రియంబు నొప్ప మే
నల్లునకుం గుమారశిరియాలునకుం గొని తెచ్చి రర్మిలిన్. 91

వ. అంత. 92

సీ. ఫాలపట్టికయందు భస్మత్రిపుండ్రంబుఁ, గర్ణంబులను గాగికమ్మదోయి
కరమునం బత్తడికంబంపుఁగంటెయు, ఘనకుచంబులమీఁదఁ గావిగంత
కటిమండలంబునఁ గరకంచుఁబుట్టంబు, ముడఁచి కట్టినమేలినడిమికట్టు
కేలుఁదామరయందుఁ గేదారవలయంబు, గడకుచ్చుమీఁదఁ బచ్చడపుఁగండ 93

తే. సంతరించి పదాలువర్షములవయసుఁ, బచ్చిబాలెంతరాలు తాపసపురంధ్రి
నంబిభామినిఁ దిరువెంగనాంచిఁ జేరి, పాలువోయింపుఁ డమ్మ పాపనికి ననియె. 94

ఉ. మక్కువ రేఁగి నెయ్యపుఁగుమారునిఁ జంపుట కంతరాయమై
యక్కటికంబు పుట్టుటకు నల్లన వచ్చి భవాని యత్తఱిం
దక్కటిమాయజోగితవిధంబున బిడ్డకుఁ బాలు వేఁడ నా
యక్కయుఁ బోసె నెల్లసమయంబులఁబోలె నిరాకులాత్మయై. 95

తే. పాలువోయించుకొని యాకృపాళుమూర్తి
శూలిపాంచాలి పాలిండ్లమూచుకములు
పాల చేఁపున గిలిగింత వాటుటయును
మెత్తమెత్తన నఱచేత నొత్తుకొంచుచు. 96

వ. తిరువెంగనాంచితో నిట్లనియె. 97

మ. ప్రజ లెల్లం బుకిఁ గ్రంతక్రంతల మహాపాపంబుగాఁ బల్కెదరున్
నిజమో కల్లయొ కాని మీ రఁట కడున్ నిస్త్రింశభావంబునన్
నిజపుత్రున్ సుకుమారుఁ జంపి యొక దర్శిర్వాణికిం జోగికి
న్భుజియింపంగ నొసర్చువార టిది యెందుం గల్గునే యిద్దరన్. 98

క. జోగులు కపటోపాయ, ప్రాగల్భ్యంబున నిధానసవసిద్ధులకై
యోగతుల నైనఁ దిరుగుదు, రోగిరముగ సుతునిఁ జంపు టుచితమె మీకున్. 99

తే. ఆవగింజంత భూతి మైఁ నలఁదికొనిన, వెలఁది గుమ్మడికాయంత వెఱ్ఱి పుట్టుఁ
గటకటా యెట్లు తనబుద్ధి కాటఁ గలియ, నిసువుఁ జంపంగఁ దలఁచెనో నీమగండు.

క. కానందు గాక కన్నులు, దానేమిటివాఁడు నీదుతనయునిఁ జంపన్
మానవతీ "మగవాఁడో, మానో" యనుమాట నేఁటిమాటయె చెప్పుమా. 100

వ. అనినం దిరువెంగనాంచి యక్కపటపుంజంగమదేవిమాటలు వినక నిర్వికారం బైన యాకారంబుతో నమ్మా శివుఁడన శివయోగి యన భేదంబు గలదే శరణార్థులయ గ్ప్రాణంబులు శివాధీనంబులు శివుండు కర్త శివుండు భోక్త యీయర్థంబునకుం జింతింపనేల సీసం దడవయ్యెడు బాలెంతరాలవు చన్నులు చేఁపుచున్నవి బిడ్డ యింతకెంత యలమటం జెందునో పాలు చాలుగదా యెప్పుడు మాయింటికి వచ్చుచుం బోవుచుండు మది నిండుకొని యుండు మని కేలుదోయి ఫాలంబునం గీలుకొల్పి సముచితవ్యాపారంబులం బ్రవర్తించుచుండం జంకు గానరాక పార్వతీదేవియు నటనుండి చనియంతర్ధానంబు నేసె నాసమయంబున. 101

తే. చేర నేతెంచి చిలుతొండసెట్టి యంత, యింతి తిరువెంగనాంచితో నిట్టులనియె,
నొజ్జలగృహంబునకుఁ బోయి యుత్పలాక్షి, వడుగు సేయఁగవలెఁ జిన్నవానిఁ దెమ్ము.

చ. చెలువ కుమారుని న్వడుగు నేసినచేతడి యాఱకుండఁగా
బోలు పెసలారఁగా నిరుగుపొర్గులవారల భాగ్యసంపదల్
కుల మభివృద్ధిఁ జెంద మనకూరిమినందనుఁ బెండ్లి సేయఁగా
వలయు ననంతరక్షణమ వైభవ మొప్పఁగ నుత్తికన్యతోన్. 103

వ. అనిన నామెయు నట్ల కాక యని యాచార్యగృహంబున విద్యాభ్యాసముఁ జేయుచున్నకుమారునిం దోడ్కొని వచ్చినంత. 104

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బకరంగఁ బెట్టి పు
త్తెంచినమంచిభక్ష్యములు తేనియ నేతను ముంచి ముంచి భ
క్షించుచుఁ దల్లిఁ దండ్రిఁ దనచిన్నికరాంగుళి వంచి వంచి యూ
రించుచు నిచ్చ మీఱఁగఁ జరించెఁ గుమారకుఁ డింటిముంగిటన్. 105

వ. అనంతరంబ. 106

సీ. జడలయల్లిక యూడ్చి సంపంగినూనియఁ, జిన్నకూఁకట్లఁ జొబ్బిలఁగ నంటి
గోప్యదేశంబు సంకుమదద్రవంబున, నయముమార నుద్వర్తనంబు సలిపి
గీసి గొజ్జఁగ నీరుపోసి నూతనక్రొత్త, చిఱుబంతి పసుపులోఁ జేవ నలఁది
కస్తూరిఁ బొరపినగంధసారంబుతో, సీకాయవొదవున జిడ్డు విడిచి

తే. లేటనులివెచ్చనీరునఁ దీర్థమాడి, వేణి యాటార్చి సురపొన్నవిరులు ముడిచి
మడుఁగు కట్టి కాటుక యిడి తొడిగి పూసి, భసితరేఖాత్రిపుండ్రంబు నొసటఁ దీర్చి.

వ. కయిసేసి కుమారునిం గనుఁగొని జననీజనకు లిట్లనిరి. 108

ఉ. భైరవయోగి కొక్కనికిఁ బాశుపతవ్రతచర్యతీరునం
బారణకై నినుం బలలపాకము గా నొసరించి పెట్టుచు

న్నారము భోజనంబు ప్రియనందన నీహృదయంబునందు సం
సారముఁ బొయ్యెఁ జాలనివిచారము లేదు గదా యొకింతయున్. 109

వ. అనినం గుమారసిరియాళుండు. 110

శా. సంసారభ్రమ మించుకేనియును మత్స్వాంతంబునన్ లేదు మీ
వంశం బీపరిపాటిదే యడుగుఁడీ వైక్లబ్యసంభావనల్
మాంసాహారము లయ్యెదన్ శివునకున్ మాయామహాయోగికిన్
హింసాక్లేశము మానుఁడీ గురులు మీరే మిమ్ముఁ బ్రార్థించెదన్. 111

వ. అని పల్కె నప్పుడు. 112

ఆ. చావ నియ్యకొనినసత్పుత్రకునకును, జంప నియ్యకొనినదంపతులకుఁ
దారతమ్య మెద్ది వీరమాహేశ్వరా, చారసమయమార్గగౌరవమున. 113

వ. ఇవ్విధంబున ముువ్వురును జందనికాపురస్సరంబుగా నేకనిశ్చయు లయిరి తదనంతరమున. 114

సీ. చన్నిచ్చులాగున జనయిత్రితొడలపైఁ, బసిబిడ్డఁ బవ్వళింపంగఁ బెట్టె
జందనిక తనహస్తప్రణాళంబులు, క్రింద నంటుక సంతరించుకొనియెఁ
జిన్నిబుగ్గల లేఁతచిఱునవ్వు వెలర్ప, శిరియాళుఁడు మొగిడ్చెఁ జేయిదోయి
చిఱుతొండనంబి క్రొమ్మెఱుఁగారు చురకత్తి, వాఁడిగా నూఱుచు వంక దీర్చె

తే. నేకమై యట్లు ముగ్గురహృదయములును, గుండ కానందవారిధియందుఁ దేలె
గురులు ముువ్వురునఁ గుమారవరునితోడ, నేకవాక్యంబుగాఁ బ్రీతి నిట్టు లనిరి. 115

మ. మది శంకింపకు మన్న మావలనిప్రేమస్నేహవాత్సల్యసం
పద వాటింపకు మన్న నాలుకతుదిన్ బంచాక్షరీమంత్రముం
బదిలం బొప్పఁ బఠింపు మన్న పరమబ్రహ్మార్థసంసిద్ధి యి
య్యది సుమ్మన్న యనుంగునందన శిరాలా వీరశైవవ్రతా. 116

ఉ. నంబి శివార్థము న్మనసునమ్మిక శంక యొకింతయేని చి
త్తంబునయందు లేక వనితామణియూరువుఁ దాపఁ జేసి తీ
క్ష్ణం బగుకత్తి మోప మెడ గ్రక్కునఁ ద్రెవ్వె నమశ్శివాయమం
త్రంబుఁ బఠించుచుండెను శిరాలుశిరంబు వసుంధరాస్థలిన్. 117

ఉ. కందక గాజువాఱక వికారము దప్పక మందహాసని
ష్యందము చెక్కుటద్దముల జాఱక నెమ్మది నిద్రవోవున
ట్లందము నొందె ధాత్రి శిరియాలకుమారునివక్త్రచంద్రుఁ డా
నందము నొందె నప్పు డెలనాఁగమనంబును భర్తచిత్తమున్. 118

తే. పన్నిదం బాడి గెలిచినభావ మొప్ప, నప్పు చక్కఁగఁ దీర్చినయనువు మెఱయు
సతియుఁ బతియును గారంపునుతు వధించి, వరుస నడపిరి వీరశైవవ్రతంబు. 119

చ. మిరియము నుల్లియుం బసుపు మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గరాంబువు గమ్మని నేయి తైలముం
బెరుఁగును మేళవించి కసుఁ జెక్కువిధ బుఁ బాకశుద్ధి వం
డిరి శిరియాళునింగటికి డెందమునం దరళాక్షు లిద్దఱున్. 120

సీ. కమ్మఁగాఁ గాఁచినకట్టునంజుళ్లను, నీరు వెళ్లఁగ నొత్తి నేత వేఁచి
చక్కఁగాఁ దఱిగినసన్నమాంసంబుల, పసపాటిమై జుట్టుఁబదను వండి
మూల్గుటెమ్ములతోడ ముదక గాకుఁడఁగఁ, జాదు సేసిననల్లచారు గాఁచి
వలయుసంబారాలు వడియాలు బలియుంచి, దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి
తే. షడ్రసోపేతములు గాఁగఁ జతురభంగి, నమృతపాకంబులుగఁ జేసి రాత్మణంబ
సెట్టి శిరియాళు వంశాబ్ధిశీతకరుని, సతులు తిరువెంగనాంచియుఁ జందనికయు.

క. నానావిధపాకములుగ, నానాలుగఁ జేసి యపుడు నాల్గువిధములన్
భోనామదోంతిఁ జేర్చిరి, సూనాస్త్రసమానుఁడైన సుతు శిరియాలున్. 122

సీ. నిగనిగం గాఁ దోమి నిండుభోనముదోంతి, భోజనశాలలోఁ బొసఁగఁ జేర్చి
చెలువ గొజ్జఁగినీటి చేపట్టు గావించి, పాటించి రత్నకంబళము పఱచి
దేవతార్చకు ధూపదీపాము లొడఁగూర్చి, కప్పురంబున ముగ్గు గలయఁ బెట్టి
యెడమదిక్కున రాగిపడిగెంబు ఘటియించి, గగగలోశమలోదకములు డించి
తే. యితివ సర్వాయితం బయ్యె నయ్యగారి, కారగింపఁగ నవసరం బనుచుఁ బలుక
సెట్టి తోడ్తెచ్చె జంగమసిద్ధవృద్ధు, నంధురా లగుముదుసలియవ్వతోడ. 123

క. శ్రీపాదంబులు గడిగెను, శ్రీపాదోదకముఁ గొనిరియెఁ జెలువయుఁ దానున్
వ్యాపారిసార్వభౌముం, డాపరమతపస్వి నునిచి యర్చించెఁ దగన్. 124

వ. అనంతరంబ చిగురు మొదలునుం గాని నిడుపు వెడల్పుం గలకదళీపలాశంబునడిమి
యూనియఁ బుచ్చి పఱచి యుదకంబునం బ్రక్షాళించి యుపస్తరించి పాయసాపూప
సూపపుండ్రేక్షుద్రాక్షాగోక్షీరమధుశర్కరా ఘృతదధిసావళీశాకపాకశిఖరిపానకం
బులతోడ గారాపుంగోడుకుపాల మేలోగిరంబుతోడం గూడ భరితభోజనంబుగా
వడ్డించి గ్రుడ్డియవ్వకు సైత మట్లనే సమర్పించి దేవ! భక్తవత్సల! శివయోగీశ్వర
రూప! విరూపాక్ష; యమృతాహారం బారగించి రక్షింపు మని చెలితోండఁడు
భార్యయుం దానును భక్తితాత్పర్యవిశ్వాసపురస్సరంబుగా నమస్కరించిన. 125

ఉ. భైరవయోగి రాజు పసిపాపనినంజుడు గూరలందు లో
నారసి చూచి మస్తకమునం దలిమాంసము లేమి గాంచి యీ
సీరసమాంస మేటికి వణిగ్వర! పుత్రుని యుత్తమాంగమున్
గూరలు సేయవైతి వినిగో నిజపుత్రనిసర్గమోహముల్. 126

తే. కటకటా! మా వ్రతంబు భగ్నంబుం జెందె, నేటిపారణ మిది మాకు నేటి కింక
నుత్తమాంగపుమాంసము నుజ్జగించి, యేల యధమాంగమాంస మే మెటు భుజింతు.

వ. అనిన విని చిఱుతొండఁడు భయపడి వెలవెలంబాఱుచుఁ దిరువెంగినాంచి వదనం
బాలోకించి యింక నెట్లనినం జిట్టమిడుచు నంతఁ దలకాయపాల మేలోగిరంబు
ముందటం బెట్టి చందనిక యిది యేను మొదలన బెడందకాం ద్రగుయోగిబృందార
కులచందం బెటింగినదాన నగుటంజేసి పాకంబుఁ జేసికొనియున్నదానఁ దపస్వి
చిత్తం బేపాకంబునుం బొందకుండ వడ్డించెదం గాకని యట్లుచేసిన నక్కుహనా
భైరవుండు వెండియు. 128

తే. బంతి నీ వారగింపక పరమపుణ్య! నాకుఁ జేయాడునే భోజనంబు సేయ
నొకఁడు భుజియించు టెన్నఁడు నొప్పదనెడు, వేదవాక్యార్థ మన్నదివినవెచెపుమ.

వ. మఱియు నొక్కభోజననియమంబు కలదు పిన్ననాఁడు బంతిభోజనంబు సేయక
కూడు నోటికిం బోదు మగబిడ్డండు లేనినిర్భాగ్యునింట భోజనంబు సేయఁగూడదు
నీకుమారు నాబంతికి రప్పింపు మారగించెద మనవుడు. 130

మ. మొదలం దేవర యానతిచ్చితిర యేమ్మం జిత్తమం దెంతు మ
య్యది నాకుం గొడు కింకనుం గిలఁడె వాఁ డాడంగ వేంచెనె నే
చదువం బోయెనె పిల్వఁ బంతు నెటు నేజాడం బ్రతీక్షించు నీ
యదనం గూరలు చల్లనారవె మహాత్మా యోగిచూడామణీ! 131

వ. అనిన నత్తపోధనుఁ డిట్లనియె నీయుత్తమాంగన యెలుం గెత్తి నలుదిక్కులం బిలుచు
నది కుమారుండు వచ్చె నేని బంతిం బెట్టుకొని భుజింతము రాకుండె నేని నేమును
నీముసలియవ్వయుం గుడుత మటుగాక యొఱగొడ్డెంబులు పలికి నీపడ్డపాటు గొడ్డె
ఱుంగా జిడ్డుపఱుపం గలవారమె యనినం బ్రసాదం బని పతియనుమతిం బురంధ్రీ
రత్నంబు. 132

సీ. రారా వణిగ్వంశవారాశిహిమధామ! రారా వికస్వరాంభోరుహాక్ష!
రారా మహాఘోరవీరశైవాచార! రారా ఘనౌదార్యరాజరాజ!
రారా కుమారకంఠీరవేంద్రకిశోర! రారా సమగ్రధీశాహిణేయ!
రారా మనోభవాకారరూపవిలాస! రారా యసారసంసారసార

తే. రార నావన్నెవడుగ ! రారా తనూజ !, రార శిరియాల ! రార నాప్రాణపదమ !
రార నాపట్టి ! కాజియ్య ! రార యనుచుఁ, జీరెఁ గారాపుఁగొడుకు రాజీవనయన.

శా. అత్తన్వంగి సమస్తదిక్కులను పర్యాయక్రమం బొప్పఁగా
నొత్తైం జిన్నికుమార రార యని యత్యుచ్చైస్స్వరంబు జీవనం
జిత్తంబుం గనవచ్చె బాలుఁడు మహాశీఘ్రప్రచారంబునన్
దత్తద్వ్యంజనపాకగంధ్యవయవస్థానప్రతానంబులోన్. 134

శా. రక్షాపాండుర మైనదేహము సహిగ్రీవేయముం గంధగా
కుక్షిం గప్పను బ్రస్ఫురద్ఘనజటాకోటిన్ శశాంకార్ధముం
జక్షుఃపద్మములోడ ఫాలతలమున్ సంధిల్ల శంభుండు ప్ర
త్యక్షం బయ్యె శిరాలుతండ్రికి హృదాహ్లాదంబు సంధిల్లఁగన్. 135

వ. అప్పుడు భయభక్తితాత్పర్యంబులు మనంబున ముప్పిరిగొన నప్పరమమాహేశ్వరుం
డిట్లని స్తుతియించె. 136

మ. జయ హాలాహలనీలకంధర మహేశా భక్తచింతామణీ
జయ గంగాధర చంద్రశేఖర జగత్స్వామీ కృపాంభోనిధీ
జయ నీహారధరాధరేంద్రతనయాచారుస్తనద్వంద్వసం
శ్రయసంలగ్న పటీరకుంకుమరజస్సంపన్న బాహాంతరా. 137

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించె నిట్లు ప్రత్యక్షం బైనవిరూపా
క్షుఁడు చిఱుతొండనంబీ ! నీవు తుంబురుండవు శిరియాళుఁడు కుమారస్వామి
తిరువెంగనాంచి యచ్చర మీరిద్దఱొక్కకారణంబున మర్త్యయోనిం జనించి
తిరి మీమీస్థానంబులనుండి తొంటిచందంబున నన్నుం గొలువుఁడు శరీరంబుల
తోడం గైలాసంబునకు రండని యనుగ్రహించిన. 138

సీ. శైవాన్వయంబున వసుధ వర్ణన కెక్కి, వేయిగోత్రంబుల వినుతిఁ గాంచి
వీరమాహేశ్వరాచారంబు వదలక, యేడువాడలవార మేము గలసి
వర్తిల్లుదుము నాసి వట్ట మేమియు లేక, యిట్టిబంధులఁ బాసి యే నొకండ
రా బుద్ధి రాదు తారకరాజశేఖర, యిందఱఁ గొనిపోయి తేని వత్తుఁ

తే. గూర్చుకొని పోవు నీ కొడఁగూడె నేని, నట్లు గా కున్న విచ్చేయు మభవ మరలి
ప్రమథసన్నిధి కేమియు బాధ లేదు, కొలిచెదము నిన్ను మే మెల్లఁ గూడిమాడి.

వ. అనిన శంభుండు కరుణించి యేడువాడలుఁ గదలివచ్చునది నీకుం బ్రియం బగునివ్వ
రం బిచ్చితి నని యానతిచ్చిన తత్క్షణంబ. 140

తే. కంచిలో నేడువాడలఁ గలిగినట్టి, నానొపుంగోమటులతోడ నంబిసెట్టి
యఖిలజీవరాసులఁ గూడి యభ్రవీధి, భాసురస్ఫూర్తి నేగెఁ గైలాసమునకు. 141

వ. ఇది కావేరీవల్లభులును సభయరావలులును కిష్కింధాచలక్రీడావినోదులు న యోధ్యాపురాధీశ్వరులును నగువైశ్యకులంబులవారలకుం గూటస్థుం డయినచిట్టు తొండనంబియుపాఖ్యానము విన్నను జదివినను వ్రాసినను బుత్రపౌత్రాభివృద్ధియును ధనకనకవస్తువాహనసమృద్ధియు నిష్టార్థసిద్ధియు నగును. 142

ఆశ్వాసాంతము.

శా. చాముండాపరమేశ్వరీవరకృపాసంవర్ధితైశ్వర్యని
స్సీమప్రాభవ లక్ష్మణాగ్రజ సుధాసిక్తోక్తరాలాప య
త్యామర్దార్జునవీరశైవసమయవ్యాపారపారీణతా
సామాన్యప్రతిభావనిర్వహణదీక్షా శక్వరాధీశ్వరా. 143

క. కర్పకట కాంఘ్రిసేవక, కర్పూరవసంతరాయ కావేరీశా
దర్పకరిపుగర్వతమో, హర్పతిసౌక్త్యదక్ష యంబురుహాక్షా. 144

తోటకవృత్తము.—అలకాధిపతీ సుగుణాభిరతీ, మలయోద్భవచంద్రసమానయశా
కులపావన యూరుజగోత్రవరా, లలనాజనతాఝషలక్ష్మనిభా. 145

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథ నామధేయప్రణీతం బయినహరవిలాసం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



# తృతీయాశ్వాసము.



పర్వతసోపాన
స్థాపక వేమక్షితీశసామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్య యన్వయ
దీపక యలకాధిరాజదేవయతిప్పా! 1

వ. ద్వితీయవిలాసం బైనగౌరీకల్యాణం బాకర్ణింపుము. 2

ఉ. తారకుఁ డన్మహాసురుఁడు తామరసాసనదత్తమైనదు
ర్వారవరానుభావమున వ్రాలి త్రిలోకము నేలుచుండు ని
ష్కారణతీవ్రబాధ ననిశంబును ముప్పదిమూఁడుకోట్లబృం
దారకులన్ మహర్షులఁ బ్రతాపగుణంబున నెచ్చి పాఁతుచున్. 3

తే. నిరపరాధబాధితు లగునిర్జరులకు, బంధమోక్షంబుఁ గావించు గంధవహుఁడు
సతులపయ్యెద విడలించి చన్నుఁగవకుఁ, దప్పు నేసియు దైత్యుచిత్తంబు వడసి. 4

మ. ప్రకటస్నేహదశాధురంధరత సర్వాంగా నిశీథంబులన్
సకలాంగంబులు నిక్కి దీపకళికాస్తంభంబులై యుద్రపా
యక చూడామణు లొప్ప రాక్షసునిశుద్ధాంతంబులన్ శేషవా
సుకికర్కోటకతక్షక ప్రముఖచక్షుశ్శ్రోత్రబృందారకుల్. 5

తే. దానవునివీటిలోన మార్తాండుఁ డెండ, యంతమాత్రంబె కాని కాయఁగ వెఱచు
నంతమాత్రము కాసిన వెలమిఁ బొందుఁ, గేళిదీర్ఘికలందుఁ బంకేరుహములు. 6

మ. పటుదిగ్వారణగండమండలలసత్ప్రత్యగ్రదానచ్ఛటా
కటుగంధం బగునీరు చిక్కనిపయద్గంగాప్రవాహంబులోఁ
పటిహైమాంబుజనాళముల్ పెఱికి యూడ్వం జేయు దేవాళిచే
నిటు దైతేయుఁడు కేళిదీర్ఘికలలో నిచ్ఛావినోదంబుగన్. 7

తే. ఐంద్ర మాసుర మాగ్నేయ మైలబిలము, వాయవీయ మైశానంబు వారుణంబు
యామ్యమును మున్నుగాఁ గలయష్టదిశలు, తానకై కొని కైకోఁడతఁడు సురల.

వ. ఇవ్విధంబునఁ దారకాసురుండు కాసరాక్ష తామ్రాక్ష ధూమ్రాక్ష చతురోదగ్ర ఖడ్గరోమ బాలబిడాల కాలనేమి ప్రధాననానాబంధుసహాయుండై పాకశాసన పావక పరేతరాజ పలలాశి పాశి పవన పౌలస్త్య పన్నగాభరణులఁ బరిభవించి నిర్జరులం దర్జించి కిన్నరుల వెన్నుసూచి కింపురుషులఁ జంపి గరుడులఁ బడలుపఱచి గంధర్వుల బంధించి గుహ్యకుల సంహరించి యక్షుల నధిక్షేపించి ఖేచరుల గీటడంచి యచ్చరల హెచ్చు గుందాడి సిద్ధులకు బుద్ధిసెప్పి సాధ్యుల సాధించి మహారాజికుల రాజసం బుడిపి విద్యాధరుల నగ్నఃకరించి మహాఋషుల నదలించి పితరులఁ బ్రతిబంధించి వసువులఁ బరిమార్చి రుద్రుల కుపద్రవం బాపాదించి విశ్వేదేవతల కనాశ్వాసం బునేసి యనశ్వరం బగునైశ్వర్యంబున నప్రతీపం బగుప్రతాపంబున నవార్యంబగు వీర్యంబున నవక్రంబగుపరాక్రమంబున నస్తోకం బగువివేకంబున నేకాతపత్రంబుగాఁ ద్రిలోకంబు లేలుచున్నకొంతకాలంబునకు. 9

సీ. అనువు దప్పిరి నొచ్చి రలసి రాపద నొందిరి, రదవద లైరి చీకాకుపడిరి
యంగలార్చిరి విచ్చి రారడిఁ బొందిరి, బ్రమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపిక లైరి సొలసిరి, కులకులఁ గూసిరి కుతిలపడిరి
గగ్గుల కాడైరి కలఁగి రోటాడిరి, వెలవెల్ల నైరి నివ్వెఱఁగుపడిరి
తే. గుసవుసవు లైరి గుజగుజ లైరి డస్సి, రొల్లఁ బోయిరి వెగ్గిరి తల్లడిల్లిరి
సిగ్గువడి రొచ్చవడిరి యుస్సురని రైరి, తారకునిచేత మునులు బృందారకులును.

ఉ. ఇట్టివిధంబునన్ విబుధు లెప్పుడునుం గనుఁగాపులట్లు ము
ప్పెట్టియుఁ జేసి చేసియును వేసరి యింద్రుఁడు మున్నుగాఁగ ది
క్కొట్టిటు లున్నమా కనుచు నేగిరి పద్మజుఁ గూర్చి యేగి కూ
పెట్టిరి హస్తముల్ మొగిచి పెద్దయెలుంగున దద్గుణస్తుతుల్. 11

వ. జయ జయ జగన్నాథ! జగజ్జననస్థితిసంహారకర! జంభారిప్రముఖనిఖిలబర్హిర్ముఖశిఖామణీమయూఖమంజరీరంజితపాదపీఠ! జలజాసన! జాహ్నవీప్రముఖసకలతీర్థతీర్థసంపూర్ణస్వర్ణకమండలుధర! జపతపోనిష్ఠాగరిష్ఠమనోధిష్ఠానబుగ్యజుస్సామాథర్వణమయనానానిశ్వాస! హిరణ్యగర్భ! భూర్భువస్సువస్త్రయీశుకీపంజర! నిరంజన! భారతీవిహారసౌధాయమానచతుర్వదన! సనాతన! సనత్కుమారజనక! శతానంద! శాశ్వత! విశ్వతోముఖ! నిర్వికల్ప! నిరీహ! నిరాకార! ఓంకారగమ్య! అదిగ్దేశకాలవ్యవచ్ఛేదనీయ! ఆదిమధ్యాంతశూన్య! అవ్యయ! అవాప్తసకలకామ్య! అనంత! అద్వితీయ! నిరస్తసమస్తోపాధికసచ్చిదానందస్వరూప! నమస్తే నమస్తే నమః. 12

తే. నీదునిట్టూర్పుగాడ్పులు నిగమపఙ్క్తి, ప్రణవమంత్రాక్షరము నీకు భద్రపీఠి
నిలయకాలంబు నీనిద్ర విశ్వమునకు, నీప్రబోధంబ యుదయంబు నిఖిలమునకు. 13

తే. అవధరింపుము విన్నపం బాదిపురుష! యవధరింపుము మమ్ము లోకాధినాథ!
తడవు సేయక రక్షింపు తమ్మిచూలి! తారకుఁడు మమ్ము పెక్కుదుర్దశలఁ బెట్టు. 14

చ. పడితిమి కుక్కలంబడినపాటులు దుర్భర మైనవృత్తి వె
స్బడితిమి గర్భయాచకులభంగి దరిద్రత నట్టుకొంచు లో
పడితిమి పాలలోఁ బడినబల్లులకై పడి నెల్లవెంటలం
జెడితిమి చేయునేల సరసీరుహసంభవ! దుష్టదైత్యుచేఁ. 15

తే. తారకుం డెవ్విధంబున ధ్వంస మొందు, నెట్టు బ్రదుకుదు మేము మా కేది దిక్కు
చిత్తగింపుము దేవ! సంశ్రితజనార్తి, హరణపారీణ! కరుణారసార్ద్రహృదయ! 16

వ. అని కరుణంబుగా విన్నవించిన హిరణ్యగర్భుండు ప్రసన్నుం డై బృందారకులను
మహర్షులనుం గనుంగొని యిట్లనియె. 17

సీ. వెలవకుం డింద్రాదివిబుధపుంగవులును, శాండిల్యభృగ్వాదిసంయములును
నస్మద్వరప్రభావానుభావంబున, వాఁడింతవాఁ డయ్యె వాఁడె మిగిలి
విషవృక్ష మేనియు వృద్ధిఁ బొందఁగఁ జేసి, తనకుఁ గాఁ జెఱుపుట తగవు గాదు
పార్వతీదేవికి భవున కుద్భవ మైన, తేజంబు వాని మర్దింపఁ గలదు
తే. తండ్రి యగుదక్షుమీఁది క్రోధంబువలన, యోగనిర్ముక్తదేహ యై యుద్భవించి
పెరుఁగుచున్నది హిమభూమిధరగృహమున,నమ్మహాదేవు శివుఁ గూర్పఁ డను వెలింగి.

వ. ఇంతనుండియు మీకు మేలయ్యెడుఁ బొండని పురందరాదిబృందారకుల వీడుకొల్పి
శతానందుండు యథోచితవ్యాపారంబులం బ్రవర్తిల్లుచుండె నిట్లు దేవతలు భావి
శుభసూచకంబు లగుగంధవాహాదినానానిమిత్తంబు లనుసంధించుచు నిజస్థానంబుల
కరిగిరి యనంతరంబున. 19

సీ. అటమున్న దక్షకన్యక తండ్రితో నల్గి, యోగమార్గమున మే నుజ్జగించి
యపరజన్మంబున నజ్ఞాకిరోని యై, యోషధులకు నెల్ల నునికిపట్టు
మేరుమందరవింధ్యపారియాత్రాదిను, ప్రథితాద్రిసంబంధబాంధవంబు
నైననీహారశైలాధినాథునకును, బితృదేవతలకన్నబిడ్డ యైన
తే. మేనకాదేవి కుదయించె మేలువేడ్క, నబ్ధిచెలికాఁడు మైనాకుఁ డన్న గాఁగ
నభిజనాఖ్య పార్వతి యన నఖిలజనని, యాదిశక్తి పురారియర్ధాంగలక్ష్మి. 20

క. పావనజంగమభువనకు, భావహ మై విశదదశదిశాంతర మై యీ
దేవి యుదయంబు నొందిన, యావేళం గుసుమవర్ష మంతటఁ గురిసెన్. 21

తే. జనని విద్యుల్లతాభి మాచాయ గలిగి, క్రొత్త యుదయించినట్టియాకూఁతువలనఁ
గారుకాలంబుమణిశలాక యను బోలె, నొప్పెఁ జువిమూరభామిని యద్ది యయ్యె.

వ. అనంతరంబ ప్రతిదినవర్ధమాన యై లబ్ధోదయ యగుచంద్రరేఖయుంబోలె బంధుజనంబులకుఁ బ్రమోదంబు నందించుచు మందాకినీసైకతవేదికాస్థలంబులఁ గందుకక్రీడ సల్పుచు నుపదేశకాలంబుల విద్యలు నేర్చుచు బాల్యంబుఁ గడపి నేత్రోన్మీలనంబు నేసిన చిత్రంబునుంబోలె యౌవనవిభక్తం బై యభ్యుదయం బై యభ్యున్నతాంగుష్ఠనఖప్రభావిక్షేపంబున రాగంబు వెడలం గ్రక్కునట్టియుం బోని చరణప్రవాళంబులు వృత్తానుపూర్వంబు లై యనతిదీర్ఘంబు లగుజంఘాప్రకాండంబులును వేదండశుండాదండంబులకు వైదండికంబు లై యొప్పారునూరువులును మేఖలాకలాపమధ్యకీలితమహేంద్రనీలమాణిక్యకిరణరేఖయుంబోలె నాభిరంధ్రంబునం బుట్టి మీఁదికి నిగుడ రాజిల్లుగోమరాజియును నవయౌవనారోహణార్థంబు మన్మథుం డొనర్చిన మణిసోపానంబులంబోనివళీవిభంగంబులును గుదుళ్లు నిండఁ బలుకం బండిన మారేడుపండ్లగారామునఁ జెలువుగ గబ్బిగుబ్బల బెడంగులును నభినవశిరీషకుసుమసుకుమారంబు లగుబాహువులును ధర్మబంధురం బగుకంధరంబును సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబుడంబు విడంబింపం జాలునాననంబును గావియగుమోవియును నూఁగుఁబూవువంటి నాసికయు నిద్దంపుటద్దములకుఁ దోడిముద్దు లగుముద్దుచెక్కులును సుమకోదండవల్లీమతల్లు లగుకటివంక బొమలును విదియనాఁటిచందురునకుం గదిసి చుట్టం బగులలాటపట్టంబును గోదమతుమ్మెదనాలుఁ బురుడింపం జాలునీలాలకంబులును నొప్ప సర్వోపమాద్రవ్యసముచ్చయం బగుసౌందర్యంబు నేకత్రావస్థానదిదృక్షచే విరించి సూక్ష్మీకరించి యథాప్రదేశనివేశితంబుగ నొనర్చెనో యనం దల్లిదండ్రులకు నామోదంబు నాపాదించుచుండ నొక్కనాఁడు నారదుండు సనుదెంచి. 23

క. త్రిభువనమోహన యగున, య్యిభగమనం జూచి పర్వతేశ్వరునిమహా
సభలో నిట్లని పలికెను, శుభవచనప్రౌఢి మెఱయ సురముని యెలమిన్, 24

సీ. ఈసరోజాతాక్షి మేనిలో సగపాలు, గణుతింప మగపాలు గాఁగ నున్న
దీపల్లవాధర శ్రీపాదపద్మంబు, నొరయు నొక్కొక్కమా టుడుగణేశుఁ
డీకాంతతోడ మందాకినీవాహిని, సవతి గాఁ గల దేమిచందమునను
ఈలతాతన్వికి ఈరేడులోకంబు, లభిరామకేళిహర్మ్యంబు లగును

తే. నిండువేడుకఁ గాంచు ఈనీలవేణి, కొమ్ముటేనుంగుమొగ మైనకొడుకుఁ గల్గు
నత్తయును మామయును లేనిరిత్తయింట, మనువు మనిపెడు నీయింతి మగనితోడ.

ఉ. మాటలు వేయు నేమిటికి మంగళలక్షణలక్ష్మి యైనయీ
బోటికి భర్త గాఁ గలఁడు సోమకిరీటుఁడు సర్వదేవతా
కోటికిరీటకోటిపరికుంచితదివ్యమణిద్యుతిచ్ఛటా
పాటలపాదపీఠుఁ డగుపట్టి కృతార్థుఁడ వైతి భూధరా. 26

వ. అనిచెప్పి నారదుండు సనియె నంతనుండి హిమవంతుండు నివృత్తాన్యవరాభిలాషుం డై యయ్యోషారత్నంబు శేషభూషణునకు నీ నిశ్చయించియు సభ్యర్థనాభంగభయంబునం జేసి. 27

క. తన్నడుగ రానిశివునకుఁ, గన్నియ నె ట్లిత్తు నతనికారుణ్యము నా
కెన్నఁడు సిద్ధించునొ యని, యన్నగపతి యాత్మఁ దలఁచె నౌత్సుక్యంబున్. 28

వ. అంత విరూపాక్షుండు దక్షరోషంబు కారణంబు గా దాక్షాయణి శరీరమోక్షంబుఁ జేసినది మొదలు గా సర్వసంగపరిత్యాగంబుఁ గావించి యపరిగ్రహుం డై. 29

సీ. గంగాప్రవాహసంక్షాళితాభ్యున్నత, రుద్రాక్షదేవదారుద్రుమంబుఁ
గస్తూరికాకురంగజనాభిపరిమళ, శ్లాఘ్యేందుకాంతపాషాణతలముఁ
గిన్నరద్వంద్వస-భిన్నపంచమరాగ, నిర్వ్యస్తహోవేగనిర్ఝరంబు
పటిత ప్రతిధ్వానభంగోరుఘుమఘుమ, ఘుమఘుమాయితదిశాగోళకంబు

తే. నైనహిమశైలపాదంబునందు నియతిఁ, దపమునే మంగమదిలోనఁ దలఁచి విడిసెఁ
బ్రమథవర్గంబుఁ దానును బసవఁ డపుడు, కృత్తివాసుండు విషయనివృత్తుఁడగుచు.

తే. ప్రమథు లెల్లరు విడిసి రప్పర్వతమునఁ, జంద్రకాంతశిలామణిస్థలములందు
నమరియుండున మేరువృక్షములనీడ, భూర్జతరుచర్మపరిధానములు ధరించి. 31

చ. బసవఁడు అంకె వైచి హిమపర్వతసానువనాంతరంబులం
బసిరిక మేసి నిర్ఝరులఁ బానెడుతియ్యనినీరు గ్రోలి క్రో
వ్వొసఁగ ఘనాఘనధ్వనుల నుల్లస మాడెముఁ దత్పురంబునన్
బ్రసభగతిన్ మృగేంద్రములు భద్రగజంబులు భీతిఁ జెందఁగన్. 32

తే. ఆత్మమూర్త్యంకరం బైనయగ్ని దేవు, నర్చనము సేసి నియతి నయ్యష్టమూర్తి
బహుతపోవ్రతనియమైకఫలవిధాత, తపముఁ జేసెను మది నొక్కతలఁపుఁ జేసి. 33

తే. అపుడు హిమవన్నగేంద్రుఁ డత్యాదరమున, నథితి యై యున్నశంభున కర్చ లిచ్చి
తత్సమారాధనక్రియార్థమునఁ బంచె, నిజతనూజ నజినసమన్వితను గాఁగ. 34

క. రమణి తపోవ్రతచర్యా, సమధికవిఘ్నంబ యనుచుఁ దలపోసియు శీ
ఘ్రము గైకొనె శివుఁడు విరా, రము లేక మదిం దపంబు రమణీమణియున్. 35

సీ. పాటించుఁబువ్వులు పల్లవంబులు గోయుఁ, గుశపవిత్రంబులుఁ గూడఁబెట్టు
నాపగ రహిఁ మీఱు నర్ఘ్యోదకములును, నుపకరణంబులు నొయ్యఁ జేర్చు
వేదికాసమ్మార్జవిధి నివర్తించును, లీలమై రంగవల్లిక లొనర్చుఁ
గల్పించు లెస్సగా గంధాక్షతంబులు, దాపించు ధూపదీపాదికములు

తే. ప్రత్యహంబును హిమనగరాజతనయ, భవునిపదపద్మములమీఁద భక్తి గలిగి
తచ్ఛిరశ్చంద్రచంద్రికాస్తబకశైత్య, శాంతపర్యటనక్రియాశాంతి యగుచు. 36

వ. అక్కాలంబునం దొక్కనాఁడు స్వర్గలోకంబునఁ బాకశాసనుఁడు కల్పానోకహం
బులనీడలఁ జింతామణివేదికాస్థలంబులందు బృందారకులు పరివేష్టింపఁ బేరోలగం
బుండి దివిజకార్యార్థసంసిద్ధిఁ బొంద మనంబునందుఁ గందర్పునిం దలంచిన. 37

సీ. కాంతాజనంబుల కటివంకబొమలతోఁ, బ్రతినచ్చు పుష్పచాపంబుతోడఁ
గోకిలవ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రింగించు, క్రొమ్మావిచిగురాకుగొడుగుతోడఁ
రతిదేవినిడుసోగఁ గ్రాలుకన్నులడాలుఁ, దలపించు మీనకేతనముతోడ
భుజగలీలావతీభుక్తశేషము లైన, గంధవాహకిశోరకములతోడఁ

తే. జందురునితో వసంతమాసంబుతోడ, రాజకీరరథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ, సంభ్రమముతో మహేంద్రునాస్థానమునకు.

ఉ. పత్త్రము పెంపునం గుసుమబాణునిమీఁద నె వ్రాలె దేవతా
ధ్యక్షుని వేయికన్నులును దక్కినవేల్పుల నుజ్జగించి సూ
క్ష్మేక్షికఁ జూడఁ గార్యగతి యిట్టిదయా ప్రభువుల్ ప్రయోజనా
పేక్ష నొకప్పు డాశ్రితులపేర సమంచితగౌరవోన్నతుల్. 39

క. రా యిటు రమ్మని చేతికిఁ, జే యిచ్చి ప్రమోదరేఖ చిగురొత్త మరు
న్నాయకుఁడు నిల్పె సుమన, స్సాయకు సరిగద్దెమీఁద సౌహార్దమునన్. 40

వ. అప్పుడు. 41

తే. పతిప్రసాదంబుఁ దనమౌళిపై ధరించి, మహితవినయావనమ్రుఁడై మన్మథుండు
సంగతంబుగ హస్తాంబుజములు మోడ్చి, విస్ఫురోక్తుల నిట్లని విన్నవించె. 42

వ. దేవర నన్నుఁ దలంపున నవధరించిన కారణం బేమి యానతిమ్ము. 43

సీ. ఎవ్వఁడు నీపదం బెలమి నుద్దేశించి, యతిఘోర మగుతపం బాచరించె
నెవ్వండు నీచిత్త మెరియించుచున్నాఁడు, కైవల్యపదవికైఁ గాలుసాఁచి
యెవ్వఁడు గురునీతి కేపాకమును బొంద, కుద్దండరీతి మాఱొడ్డి నిలిచె
నెవ్వఁడు దంభోళిహేతినిర్ఘరధారఁ, దలఁచె నీలోత్పలధారఁ గాఁగ

తే. వాని భంజింతు నాతనిమాన మడఁతు, నతని నిర్జింతు నాతని నతకరింతు
నానతిమ్ము మహేంద్ర నాయట్టిహితుఁడు, నీకుఁ గలుగ నసాధ్యంబు నెగడు నెందు.

తే. ఏకభర్తృవ్రతస్థ యై యేలతాంగి, నీకుఁ జేయాడుధర్మంబు విస్మరించె
నది వినిర్ముక్తలజ్జ యై యమరరాజుఁ, జేయఁ గాత స్వయంగ్రహాశ్లేషణంబు. 45

తే. ప్రణయకోపప్రశాంతికై పాదపతితు, నిన్ను నేపువుఁబోఁడి మన్నింప దయ్యె
నాలతాంగిఁ బ్రవాళశయ్యాశరణ్య, సేహఁ గావింతు పదువు సందేహ మింద్ర.

క. నీవజ్రము సుఖముండుం, గావుత దివ్యాస్త్రశాలికామధ్యమునన్
దేవేంద్ర చెఱకువింటం, బూవులు శరములుగ నే ... 47

వ. నీప్రసాదంబున మలయానిలంబుపాంథుని వసంతంబుసహాయంబును నిండువెన్నెల చెలిమియుం గలుగఁ బినాకపాణి యగుహరు నైన జయింపం జాలుదు నని తలం తుం దక్కినవారు నా కెవ్వరు నెంత యని యుత్సాహంబునం బల్కినం బురందరుం డు సంకల్పితార్థంబు సఫలం బయ్యె నని యంతరంగంబున సంతోషించుచుఁ గంతున కి ట్లనియె, 48

సీ. సంకల్పసంభవ సమకూర్తు వట్లనే, యరుగంగ నీ కసాధ్యంబు గలదె
యటుకాన కానిమహా కార్యభరమునం, దేను నియోగింతు మిపుడు నిన్ను
ధరణిభారధురీణతాప్రౌఢి కని కదా, తను మోఁను శేషునిఁ బనిచెను హరి
విబుధకార్యార్థంబు విశ్వేశ్వరు గుఱించి, యరుగంగవలయు నీ వధికభక్తి
తే. సుధరకన్యను శశిమౌళిఁ గూర్పవలయుఁ, బార్వతీపరమేశ్వర ప్రభవ మైన
దివ్యతేజంబు సేనాపతిత్వ మొంది, జయముఁ గావించు నని చెప్పె జలజభవుఁడు.

వ. హిమాద్రిపాదంబున దేవదారువనంబున నియతాత్ముఁ డై పరబ్రహ్మానుసంధానంబు సేయుచు నంధకారాతి తపంబు సేయు చున్నవాఁడు పార్వతియు హిమవన్నియో గంబున నీశ్వరునకుం బాయక పరిచర్య సేయు చున్నయది యీవార్త సకలలోక వృత్తాంతవిజ్ఞానార్థంబు పంపిన యప్సరస్స్త్రీవర్గంబువలన వింటి నిది కార్యక్రమంబు.

తే. ఇది యనన్యసాధారణ మిది యవశ్య, మిది పరోపకృతిక్రియాభ్యుదయశాలి
చేయు మిప్పని సంకల్పసిద్ధి గాఁగ, బాహువిక్రమపారీణ పంచబాణ. 51

తే. కోరి యభ్యర్థనము సేయువారు సురలు, కార్య మూహింప మూఁడులోకమ్ములకును
నతిశుభము కృత్యమో యల్ప మైనఁ గాదు, కామసంస్పృహణీయవిక్రముఁడ వీవు.

వ. హుతాశనునకు సమీరంబుంబలె నుధుమాసంబు సహాయుం బగుం గాత మర్థలాభం బును సేమంబును బునర్దర్శనంబు నయ్యెడు మని దీవించిన దేవేంద్రునియానతి ము త్యాలసేస బోలె శిరంబునఁ దాల్చి యైరావణకుంభకుంభాస్ఫాలనకర్కశం బగు కరంబున వాస్తోష్పతి తన్ను సంస్పర్శించి గౌరవించిన మన్మథుండు మధుసహాయుం డై హిమవత్పర్వతంబు సేరం జనియె నాసమయంబునందు. 53

చ. సకలవనంబులందుఁ గలసంయమికోటి తపస్సమాధిని
ష్ఠకుఁ బ్రతికూలవర్తి యయి షట్పదకోకిలరాజకీరజా
లకములతోడఁ గూడ ఝషలాంఛను నెచ్చెలికాఁడు వచ్చె వా
రక మధుమాసరాజు నవరాగసమంచితపల్లవాస్త్రుఁ డై. 54

తే. ఉత్తరాభిముఖుం డైనయుష్ణరశ్మి, చంద మీక్షించి దక్షిణాశాపురంధ్రి
గంధవాహంబు దీర్ఘదీర్ఘంబు గాఁగఁ, జాఁగ విడిచెను విరహనిశ్వాసభంగి. 55

శా. ఆమూలాగ్రమశోకపాదపము ప్రత్యగ్రప్రవాళావళి
వ్యామిశ్రంబుగఁ బూచె నప్పు డటు నీహారాద్రికుంజంబునన్
భామాకోమలపాదపంకరుహసంపర్కం బపేక్షింప కు
ద్దామం బైనవసంతజృంభణము సత్త్వం బొప్ప దీపింపఁగన్. 56

తే. చివురుగటితోడ లేమావిపువ్వులు శరములఁ, జేసి మధుమాసకాలంబు చిత్తజునకు
నళికులంబులపేర నామాక్షరములు, వరుసతో నిల్పె ననఁ బొల్చె వానియందు. 57

క. నవకము లగుములు మోదుగుఁ, బువుమొగ్గలు విపినవీథిఁ బొల్చె సలాకల
దివుట వసంతుం డనుప, ల్లవుఁ డిడినవనఖక్షతంబులకు సరి యగుచున్. 58

తే. చెమట కింపురుషస్త్రీలచెక్కులందుఁ, గ్రమ్మి మృగనాభిపత్త్రభంగంబులఁ గరఁచెఁ
జలువ ద్రవ మింపఱయ్యెఁ జన్నుఁగవకు, నలరుఁ బన్నీటితో గుహ్యకాంగనలకు. 59

వ. అప్పుడు వనౌకసు లగుతాపసులు నిప్రయత్నసంస్తంభితక్రియారంభులును మదనుం
డు సమారోపితపుష్పచాపుండును మధుకరంబులు కుసుమపాత్త్రపరిపూర్ణమధురసగం
డూషసముపలాలితప్రియాసందోహంబులును మృగంబులు మృగీకండూయనపరా
యణంబులును నై యుండిరి వెండియు. 60

ఉ. పంకజరేణుగంధి యగుపల్వలవారిఁ గరేణు విచ్చె ని
శ్శంక మదావళంబునకు గంధగజంబును బద్మినీమృణా
లాంకుర మర్ధభుక్తము నిజాంగనకుం బ్రియ మారనిచ్చె నా
వంకఁ దపోధనుల్ హృదయవత్సలతన్ బ్రియ మంది చూడఁగన్. 61

ఉ. దేసికగానిమార్గములఁ దిన్ననిరీతులఁ బాడిపాడి యా
శ్వాసము నొంది సోలి యరవాడినయంగనమోముదమ్మిఁ బు
ష్పాసవఘూర్ణితేక్షణను లల్లనఁ జుంబన మాచరించి యు
ల్లాస మొనర్చెఁ గిన్నరవిలాసి హిమాచలకందరంబునన్. 62

తే. అచ్చరలు పాడుహిందోళ మాలకించి, యిందుమౌళి ప్రసంఖ్యాన మెడలఁడయ్యె
నిర్జితేంద్రియు లైనట్టినియమపరుల, నంతరాయంబు లేమి సేయఁగఁ గలవు. 63

వ. అప్పుడు వామప్రకోష్ఠార్పితహైమవేత్త్రకుం డగునందికేశ్వరుం డభినవవసంతసమ
యారంభసంభూతమనోవికారంబు లగుప్రమథవీరులభావంబులు భావించి హుంకా
రంబు సేసి మానుమని యదల్చిన నాశిలానందనుదివ్యాశ్రమంబునఁ గాననం బెల్ల
నిష్కంపవృక్షంబును నిభృతద్విరేఫంబును మూకాండజంబును బ్రశాంతమృగభారం
బు నై చిత్త్రార్పితాపస్థానంబునుంబోలె నుండె నేనియు మనోభవుండు ముక్కంటి
యెదురఁ జక్కటి గాని యొకపక్కియగాఁ బురశ్శుక్రంబు నడచువాఁడునుంబోలె
మనంబునం జంకుచు నెట్టకేలకు నాజగజ్జెట్టి తపంబు [illegible] పట్టునకుం

జనుదెంచి చుట్టును దిరిగియున్న సురపొన్నమోకల నీడ నిల్చి యచ్చోట శార్దూల
చర్మంబునం బర్యంకబంధురీతిపూర్వకాయుండును నుత్తానపాణియుఁ బ్రాణాయామ
పరుండును నగు నమ్మహాదేవుని పార్శ్వంబునం బుష్పాంజలి పట్టి ధ్యానావసానావస
రముం బ్రతీక్షించుచుఁ గించిద్విలంబమానకేసరచ్ఛదాభిరామకాంచీకలాపయుఁ గర్ణి
కారకుసుమతాటంకయుఁ బల్లవావతంసయు నగు పార్వతిం గనుంగొని యిదియ నా
కవసరం బని యధిజ్యశరాసనుండై, 64

సీ. వఱుదకెంజడకొప్పు వదలి వీడక యుండఁ, బెనుపాఁపతలపాగ బిగియఁజుట్టి
మెడకప్పుతోఁ గూడి మిక్కిలి నలు పైన, కమనీయకృష్ణాజినము ధరించి
భ్రూవికారము లేనిపొడవుఱెప్పలలోని, ఘనదృష్టి నాసికాగ్రమున నిల్పి
యోగపట్టికఁ జెంది యొఱపైన నిలుకడ, నాసనస్థితబంధ మనువుపఱచి
తే. నిస్తరంగక మైనమున్నీరువోలె, గర్జితము లేనిఘనఘనాఘనము వోలె
ధ్యాననిశ్చలుఁ డగు నిందుధరునిఁ జూచి, ప్రసవనారాచుఁ డతిభయభ్రాంతుఁ డగుచు.

ఉ. ఒయ్యన డాయఁగాఁ జనియె నుగ్రవిలోచనుపార్శ్వభూమికిం
దయ్యము ఱేఁడు నెచ్చెలి యెద౯ భయకంపము నుప్పతిల్లఁగాఁ
దియ్యనివిల్లుఁ బుష్పములఁ దీర్చినయమ్ములు శౌర్యసంపదల్
వయ్యము గాఁగ భూమిఁ బడ వైచె నిలింపులు చూచి బెగ్గలన్. 66

క. స్థావరరాజతనూభవ, యావేళన డాయ వచ్చె నభవుని సేవా
హేవాకప్రౌఢిని చన దే, వత లెంతయు గభీరగతిఁ జనుఁ గొలువన్. 67

తే. పద్మరాగవిభూషణప్రతతిమాఱు, లలి నశోకలతాప్రవాళములు దాల్చి
సింధువారప్రసూనరాజీవరాజిఁ, గమ్రముక్తికరత్నశృంగార యగుచు. 68

చ. చనుఁగవ ప్రేఁగున న్నిగుల సన్నపుఁగౌ నసియాడఁ గెంపు మీ
ఱిన నునుఁబట్టుఁజేలఁ గటి ఱింగులు వాఱఁగఁ గట్టి భూమిభృ
త్తనయ ప్రసూనగుచ్ఛములు దాలిచి లేఁజిగురుల్ ధరించి వ
చ్చిన నడదీవవోలె నిలిచెం దరుణేందుకిరీటుసన్నిధిన్. 69

తే. తరుణి యందందఁ గేసరదాను కాంచి, జఘనపులినంబు నందుండి జాఱిపడఁగ
మాటిమాటికి హస్తపద్మముల నెత్తు, చపలభావంబుతో నుండె నభవుమ్రోల. 70

ఉ. కమ్మనియూర్పుగాడుపులగందముఁ గ్రోలఁగ వచ్చి యోష్ఠబిం
బమ్ముసమీపదేశమునఁ బాయక యాడెడు తేఁటిఁ గేళిప
ద్మమున మాటిమాటికి సమంచితవిభ్రమలోలదృష్టి యై
యమ్మదిరాక్షి చిమ్ము దరహాసవికస్వరగండపాళి యై. 71


7

తే. అఖిలలక్షణసంపూర్ణ యైనయట్టి, యాలతాతన్విఁ జూచి పుష్పాయుధుండు
రమణ దాఁ బూనుదేవతారాధనంబు, సఫలతం జెందె నని చాల సంతసిల్లె. 72

ఉ. అప్పుడు డాయ వచ్చెఁ దరుణాబ్జకళాధరు గౌరి భక్తితో
నప్పుడు డాసె నీశ్వరుఁడు సంచితయోగసమాధినిష్ఠమైఁ
దప్పక బాహ్యసీమఁ బ్రమదం బెసఁగం బరమంబు సోహమై
యొప్పెడుదివ్యతేజము సముజ్జ్వలకోటితటిత్ప్రకాశమున్. 73

క. అసమభయభక్తు లలరఁగఁ, గుసుమంబులు గోయిలించి కోమలి నించెం
గిసలయభంగంబులతో. నసదునడుము వణఁక మృదునియడుగులమీఁదన్. 74

ఉ. పల్లవపుష్పభంగములు పాదసరోరుహయుగ్మకంబుపైఁ
జల్లి శ్రవోవతంస మగుసంపగిమొగ్గ యొకింత జాఱఁగా
నల్లన మ్రొక్కెఁ బార్వతి భయంబును భక్తియు సంభ్రమంబు సం
ధిల్లఁగ భర్తకున్ ఘనఫణిప్రభుహారున కంధకారికిన్. 75

క. పరిలేనిమగనిఁ బడయుము, తరుణీ యని పల్కె శివుఁడు తథ్యమ యిది యీ
శ్వరభాషితమునకుం దర, తరములయందైన నన్యథాత్వము గలదే. 76

ఉ. పంచశరుండుఁ దత్పరత బాణవిమోక్షణకాలముం బ్రతీ
క్షించుచు గౌరి శంకరునిఁ జేరినయప్పటినుండి యెప్పుడున్
నించునొకో హరుండు తరుణీమణి నంచును వింట నారి సా
రించుచు నుండెఁ జెంత స్వీకృతదైవతకార్యధుర్యుఁడై. 77

తే. ప్రియము శోభిల్లఁగా సమర్పించె గౌరి, పసనిపయ్యెద జాఱి దోఃపల్లవమున
భానుదీప్తులు నీటారి ప్రస్ఫుటనైన, పృథులమందాకినీపద్మబీజమాల. 78

తే. అంబుజాక్షి సమర్పింప నాదరమున, నక్షమాల్యంబు నిటలాక్షుఁ డందుకొనియెఁ
బంచబాణుండు సంధించె నించువింట, నస్త్రరాజంబు సమ్మోహనాశుగంబు. 79

చ. శమనారాతి నివృత్తధైర్యుఁ డగుచుఁ జంద్రోదయారంభకా
లమునం బొంగిన దుగ్ధసాగరములీలం బక్వబింబాధరో
ష్ఠముఁ గర్ణాంతవిశాలనేత్రము నతిస్వచ్ఛంబునై యొప్పు గౌ
రిముఖాంభోజమునందు నిల్పె సరసప్రేమంబునం జూడ్కులన్. 80

తే. శైలసుతయును భావంబుకీలు దెలిసి, యంగకంబులఁ బులకంబు లంకురింప
వ్రాల్చె నెమ్మోము లజ్జాభరంబుపేర్మిఁ, గేకరాలోకనంబులఁ గెల్లుమలఁగి. 81

వ. అనంతరం బంతకమథనుం డతర్కితం బైనయింద్రియక్షోభంబు బలాత్కారంబు
గా గుదియించి, చేతోవికారంబునకుం గారణంబుఁ దెలియం దలంచి దిశాంచలంబు

లకుంజూపు వలపునప్పుడు కట్టెదుర దక్షిణాపాంగనిక్షిప్తముష్టియు నాతతాంగుండును నాకుంచితసవ్యపాదుండునుం జక్రీకృతకార్ముకుండును బ్రహతోద్యుక్తుండును నైన మన్మథునిం గనుంగొని తపఃపరామర్శవివృద్ధక్రోధుండయ్యె నవ్వేళ భ్రూభంగదుష్ప్రేక్షం బగువిరూపాక్షునిలలాటేక్షణంబునం జనియించిన సముజ్జ్వలజ్వాలాజాలం బైన కృపీటయోని భువనంబులెల్ల భయభ్రాంతంబులై హాహాకారంబులు సేయ సమీనకేతనుశరశరాసనతూణీకంబుఁతోడం గూడ భస్మంబు చేసిన. 82

సీ. నాకభూషణుఫాలనయనానలముచేతఁ, బంచబాణుఁడు బిట్టు భస్మమయ్యెఁ
బ్రబలాభిషంగసంప్రభవమోహంబునఁ, గేలిని యవశ యై వ్రాలె ధరణి
యుపతిసంసర్గంబు యోగవిఘ్నం బని, యభవుఁ డంతర్ధాన మాచరించెఁ
జెలికాఁడు తన మ్రోల నొనికి బూడిద యైన, నామని యేడ్చె నా వఱచినట్లు
తే. గౌరి తనచారుసౌభాగ్యగౌరవంబు, విలువ పోయినచెలువున విన్నవోయెఁ
బర్వతేంద్రుండు నిర్విణ్ణభావ యైన, కూర్మినందన నింటికిఁ గొంచుఁబోయె. 83

వ. అనంతరంబ రతీదేవి మోహాంధోన్మీలితంబు లైనలోచనంబులనత్యంతప్రియదర్శనుం డగుప్రియుం గానక పురుషాకారంబున భూమిం బడియున్న భస్మంబుం గని యిట్లని ప్రలాపింపం దొడంగె. 84

ఉ. చక్కనివారిలోన నెఱజాణలలో విటరాజకోటిలోఁ
జిక్కనివారిలోఁ గడుఁ బ్రసిద్ధివహించిన నీవు ప్రాణముం
దక్కినచోట నీమనసు ధైర్యమున న్నిమిమింతురాలు గా
నక్కట! పుష్పసాయక మహాకఠినాత్మలువో మృగేక్షణల్. 85

మ. ప్రతికూలాచరితంబు నావలన నల్పం బైననుం గాంచితే
ప్రతికూలాచరితంబు నీవలన నల్పం బైన నేఁ గంటినే
కృత మెన్నఁడును లేనిచంద మిది లక్ష్మీపుత్ర! నీయంత న
న్నతిదుఃఖాన్వితఁ డించి పోవఁ దగవా యథ్యానపుంబట్టునన్. 86

క. తలఁతే మన్మథ! గోత్ర, స్ఖలితంబుజఘనసూత్రకరబంధంబుల్
కలఁతే మత్తేయు వసంతో, త్సలకలికారాధనంబుఁ దత్సమయమునన్. 87

క. మెఱయంగ ముసురఁ గురియఁగ, నుఱుమం బురవీథులం బయోధరవేళం
జెఱవల రమణులమొద్దక, నిఱుఁజీఁకటిదిశల నింక నెవ్వం డనుపున్. 88

సీ. మదిరారసాస్వాదమదవికారంబులు, బింబాధరలకు విడంబనములు
ప్రియవియోగంబున బెదరించువాఁ డయ్యె, నుడువల్లభుఁడు నిష్ఫలోదయుండు
కోయిలనోరూరు క్రొత్తమామిడిమోక, నవపల్లవంబులు బొజంగె మ్రోడి గా
శుకశారికలు గూడి శోకస[illegible]

తే. మాసములు దుఃఖపడె మధుమాధవములుఁ, జిన్నిమలయానిలంబులుఁ జిన్నవోయె
మాట లేటికి వేయు నోముగలరాజ, విశ్వమున నీవు లేకున్న వెలితి పడియె. 89

తే. హృదయమున నుండి యెప్పుడు హృదయనాథ
ప్రియముఁ జెప్పెద నను పెల్ల భేషజంబు
హృదయమున నుంట నిజ మేని మదన యెట్లు
భస్మమైతివి నే నెట్లు బ్రదుకఁ గంటి. 90

వ. మన్మథ! మధురాలాపవినిసర్గపండితంబు లగుగండుంగోయిలల నేలొకో భువనంబులకు రాయభారంబు పంపవు? ప్రణిపాతయాచితంబు లగుగాఢోపగూహనంబులు మఱచితే? యార్తవం బగుకుసుమప్రధానంబు నాయంగంబులం దిది నీవు రచియించినది కదా? దక్షిణేతరం బగుమదీయచరణంబు లాక్షారాగపరికర్మంబునకుం దగదొకో? పతంగమార్గంబున నింగలంబునం బడి భవదంకంబాశ్రయించెదఁ గాక మదనుండు లేక రతీదేవి జీవించు ననునపవాదంబు లోర్వవచ్చునే? నీసుహృదీశ్వరుం డయినవసంతుం డెచ్చట నున్నవాఁడు? పటుక్రోధరేఖావటద్భ్రూభ్రమిభంగభీషణముఖుం డగుఫాలలాటలోచనులోచనంబుచిచ్చున నతండును వెచ్చి నిన్నుఁ గూడెనే యని యనేకప్రకారంబులం బలవింపఁ దత్పరిదేవనాక్షరంబులు బాణపాతంబులం బోలి తూఱినాటుటయు నెంతయు నొచ్చి యమ్మధుమాసం బక్కుసలయకోమలికిం బుట్టిన మహావ్యసనంబూరార్పం జేర వచ్చుటయు. 91

సీ. క్రొమ్మిడి కై పెక్కు కుసుమంబు లుమియుచు, నవటుప్రదేశంబునందుఁ బొరల
జేవురించిన లేఁత చెక్కుటద్దంబులఁ, దాటంకయుగళంబు తన్నియాడ
నాక్రోశపరిదేవనాక్షరవ్రాతంబు, కంఠగద్గదికచేఁ గ్రక్కుపడఁగ
హరినీలములచాయ నక్షిగోళమ్ముల, సొబగుగాఁ గన్నీటిసోన గురియ
తే. ముత్తియంబులు పేరులు ములిసిపడఁగ
హస్తముల వీఁగుఁ జనుదోయి యడఁచుకొనుచు
సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి
కమలినవసంతు నెదుట దుఃఖార్త యగుచు. 92

వ. ఇవ్విధంబున నారామ పేరామనియెదుట నెమ్మనంబునఁ బేరామనియై వర్తిల్లు నార్తి సంబెరంబిచ్చి సొమ్మసిలంబోయి లేచి వసంతునిం గనుంగొని మాధవ!. నీచెలికానిం జూడు కపోతకర్బురం బైనభస్మం బైనవాఁడు! నీవు వచ్చుట యెఱుంగండు సుమ్మీ! ససురాసురం బైనజగంబు బిసతంతుగుణం బైనకోదండంబునం గలగుండ్లు వెట్టు నిట్టి జగజెట్టియుం గలండే? [illegible] బైనదీపంబు

నుంబోలె నీపరమమిత్రుండు క్రష్మతిలండు సుమ్మీ! నాపాపంబునం జేసి విధి వెలి
గాఁ ద్రొన్ననవిలుకానిం గొనిపోయె. నీవును బరమమిత్రుండవు గావున నన్నును
నగ్నిముఖంబున నీసఖుం గూర్పం బాడి. "శశితోడంగూడఁ గౌముదియు మేఘం
బుతోడంగూడ మెఱుంగు" ననుట సకలసమ్మతంబు. కుసుమశరుశరీరభసితచూ
ర్ణంబు శరీరంబునందాల్చి నామేను విభావసునందు వ్రేల్చెదం గిసలయతల్పంబులకు
నిట మున్ను సహాయుండ వగునీకుఁజితి పేర్పంజాలవచ్చునే యని పల్కి శోకావే
శంబున వెండియు. 93

సీ. హస్తయుగ్మము మోడ్చి ప్రార్థించి పలికెదఁ, దమ్ముఁడా నా కిమ్ముఁ దగఁ జితాగ్ని
మందమందంబుగా మలయానిలంబులు, వెరవుతో మండంగ విసరుఁగాతఁ
బరలోకతృప్తికై బంధు లిద్దఱును, ధర్మోదకం బిండు తమ్మితేనె
సహకారమంజరీచరుపిండకబళంబు, పెట్టుం డు మాకునై పికము ముట్టఁ
తే. దేనె పెట్టుఁడు కస్తూరి దీర్చి యచటఁ, జేర గొజ్జంగపూనీటఁ జెంబు లిడుఁడు
నన్ను వలరాజుఁ దలఁచి మన్నన దలిర్పఁ, దగ సమర్పణ చేయుఁడు దంపతులకు.

వ. అని తెంపుసేసి యగ్నిప్రవేశంబున కాయితంబై యున్నసమయంబున రతినుద్దేశించి
యాకాశవాణి యోమన్మథపత్నీ! సాహసంబు వలన దుడుగుము. నీకుం జేరువన
మేలు గాఁగలయది నీమగఁడు కందర్పుండు భుజాదర్పంబునం గన్నుఁ గానక కన
కగర్భుని సమావిర్భూతమనోవికారునిం జేసి తనకుమారికయం దతనికిఁ గాఁగానిత
లంపుఁబుట్టించె. కన్నియంగవసిన తనయాన్యాయంబునకుం దాన రోసి సరసిరుహాస
నుం డీసునం బుట్టించినవాఁడు కుసుమశరుండుకదా! యద్దురాత్ముండు హరకోపా
నలంబున భస్మం బగుం గావుత మని శపించిన నది కారణంబుగాఁ బ్రద్యు
మ్నున కిద్దురవస్థ తటస్థించె. 95

ఉ. ఎప్పుడు పెండ్లియాడుఁ బరమేశ్వరుఁ డద్రితనూజ వేడ్కతో
నప్పుడు లబ్ధసౌఖ్యుఁ డయి యంబికప్రార్థన నాసదాశివుం
డెప్పటియట్ల సర్వభువనైకధనుర్ధరునిం బ్రియుం బ్రియం
బొప్పఁగ నిచ్చు నీకు మది నొందడు తలంపకు నమ్ము మాత్మలోన్. 96

వ. అనియదృశ్యరూపం బైనభూతంబు రతీగేవిమరణవ్యవసాయబుద్ధి మందీభవింపం
జేసెఁ గుసుమాయుధబంధుం డగువసంతుండును నావృత్తాంతంబునకు సంతసించి
యక్కాంత నూరార్చి నాశాపాంతం బవలంబించి శంబరారిపత్నియు గౌరీకళ్యా
ణకాలమ్మం బ్రతీక్షించుచు విరహక్షీణం బైనశరీరంబు రక్షించుకొను చుం
డె నంత. 97

## ఆశ్వాసాంత్యము.

ఉ. మంకణమానివంశమణిమండన ! కాంచిపురీనివాస ! యే
ణాంకకిరీటదివ్యచరణాంబుజసేవక ! వైరిభద్రనా
గాంకుశ ! హారహీరదరహాసవిపాండురకీర్తిచంద్రికా
లంకృతదిగ్విభాగ ! శుభలక్షణ ! వారిరుహాయతేక్షణా! 98

క. కరదీపదానశోభిత, బిరుదాంకిత ! యంబునిధిగభీరసుహృదయా!
హరచరణకమలపూజా, పరతంత్రస్వాంత !నంశపావనచరితా! 99

మాలిని. మాచమాంబాసుతా ! మానదుర్యోధనా, యాచకాభీప్సితత్యాగచింతామణీ!
ధీచతుర్వర్గ యాస్తిక్యసంపన్నిధీ! లోచనాంభోరుహాలోలలక్ష్మీకళా! 100

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథ నామధేయప్రణీతంబైన హరవిలాసంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము.





కావేరీవల్లభ !
లోకస్తవనీయ ! సర్వలోకాశ్రయ ! ద
క్షీకరభూషణభక్త ! సు
ధీకలితవివేక ! యవచిదేవయతిప్పా ! 1

స. ద్వితీయవిలాసం బైనగౌరీకళ్యాణం బాకర్ణింపుము. 2

తే. అవ్విధంబునఁ దనమ్రోల నసమశరుఁడు, తనకుఁగా నీశ్వరునిచేత దగ్ధ మైన
ధరణిధరకన్య నిందించెఁ దనదురూపుఁ, బతులు మెచ్చనిచెలువు నిష్ఫలమ కాదె. 3

వ. అనంతరంబ వసుంధరాధరకన్య యవంధ్యప్రతిజ్ఞ యై తపస్సమాధినియతత్వంబు
వహియింప నిజాభిప్రాయంబు మేనకాదేవి కెఱింగించిన. 4

తే. గ్రుచ్చి కౌఁగిలించుకొని యమ్మహీధర, సార్వభౌముదేవి చతురభంగి
బుజ్జగించి కూర్మి పొంపిరివోవంగ, హితమితోక్తిఁ బుత్త్రి కిట్టు లనియె. 5

ఉ. ఎక్కడ లేర వేల్పులు సమీప్సితదాతలు ముద్దుఁగూన నీ
వెక్కడ ఘోరతీవ్రతప మెక్కడ యీఘటసాహసిక్యముల్
తక్కక శిరీషపుష్ప మవధానపరత్వమునన్ మధువ్రతం
బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునొ నిశ్చయింపుమా, 6

తే. అని నివారించె గిరిపత్ని యనుఁగుఁగూఁతుఁ, బార్వతియుఁ దల్లిమాటఁ జేపట్ట దయ్యె
నీప్సితార్థంబునకుఁ జాఱుహృదయరుచియు, నిమ్నమున దోడిగిలునీరు నిలుపరాదు.

వ. అంత నాచంద్రానన సఖీముఖంబున నిజమనోరథంబుఁ దండ్రి కెఱింగించి యమ్మ
హానుభావుచేత నరణ్యనివాసమునకును ఫలోదయాంతం బైనతపస్సమాధికిని నాన
తి వడసి దృఢప్రతిజ్ఞానిర్వాహంబున. 8

మ. భూధరరాజకన్య మణిభూషణముల్ దిగఁద్రావి యీశ్వరా
రాధనకేళికౌతుకపరాయణ యై ధరియించెఁ బాండుర

ష్టాధృతిపూర్వకంబుగఁ బ్రగాఢపయోధరమండలీసము
చ్ఛేదవికీర్ణసంహతుల నేలుమహీధరవల్కలంబులన్. 9
తే. పాశుపతదివ్యదీక్షఁ జేపట్టి గౌరి, చంచరీకాంగనాకరుచ్ఛాయ నేలు
కుటిలకోమలతరదీర్ఘకుంతలములు, మడమ లంటఁగ నిడుపాటిజడలు గట్టె. 10
సీ. ముత్యాలపేరులనూలు మురువుసూపెడునట్టి, జఘనంబుపై మౌంజి నవధరించెఁ
గందుకక్రీడపై గారంబుపచరించు, హస్తాబ్జములఁ బూనె నక్షమాల
కస్తూరికాంగరాగములతో విలసిల్లు, తనువల్లి హత్తించె ధవళభూతి
బొమ్మపెండిలిపాటఁ బ్రొద్దుపుచ్చు నెలుంగు, నీలకంఠస్తోత్రనియతిఁ గూర్చెఁ
తే. బసిఁడికమ్ములయందంపుఁబట్టుచేల, కొంగుచాటున వర్ధిల్లుకుచభరమునఁ
గంతఁగా వైచెఁ బులితోలుకళవసంబుఁ, బరమకళ్యాణి గిరిసార్వభౌమతనయ. 11
తే. హంసతూలికపాన్పుపై నలరుమొగ్గ, యొత్తుసును మేనుగల్గునీలోత్పలాక్షి
బాహువల్లి తలాడగాఁ బవ్వళించె, శైలపాషాణపట్టికాస్థండిలమున. 12
తే. పాశుపతదివ్యదీక్షావిభాసమాన, దివ్యతేజోవిశేషసందీప్తమూర్తి
కాలతాఁగికి శతవృద్ధులైనమునులు, ప్రణతు లగుదురు భావిప్రభావశక్తి. 13
వ. ఇవ్విధంబున ధరశిఖరంబులయందలిహరిణకిశోరంబులకు నరణ్యబీజాంజలినిగారం
బును దరులతాకుంజంబులకు నిర్ఘరధారానేకంబును నొనర్చుచుఁ గృష్ణాజినోత్తరా
సంగపతియు సర్వాంగభసితాభ్యంగమంగళస్నానయు నై కొంతకాలంబు గపి
కాంక్షితంబు కడఁ గానక తెంపు నేసి మండువేసవిం గనగన మండు నగ్నిచుట్టుల
నడుమన నిలిచి మధ్యాహ్నకాలంబున నర్కమండలం బాలోకించియు వర్షాకాలం
బునఁ బక్ష్మపాళీక్షణస్థితంబులును దాడితాధరంబులును బయోధరస్తనసపాత
చూర్ణితంబులును త్రివళీక్షణస్ఖలితంబులును నాభిగహ్వరప్రవిష్టంబులు నగుజలధరజల
బిందుధారలం దోఁగియు శిశిరకాలంబునం దివతాళించుకొలంకులలోనం బుక్కటి
బంటినీట నిశాసమయంబుల నిలిచియు నంబుచళీకంబులను నుడుపతికరంబులను
కరువలిండుల్లినజీర్ణతరుపర్ణంబులను నాహారంబుగా దుష్కరం బైనతపంబు సేయు
చుండ నొకనాఁడు. 14
మ. అజినాషాఢధరుండు పౌరిషతరభాషాతిప్రగల్భుండు నీ
రజబంధుప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ డేకాకివటుండు బ్రాహ్మణుఁడు విశ్రామార్థుఁడుంబోలె నా
త్రిజగన్మోహనమూర్తిసన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్. 15
తే. ఇవ్విధంబున నేతెంచి యెదుట నిలిచి, గౌరి నాశీర్వదించె నక్కపటవటుఁడు
కలితకోమలనవకుశగంధి యైన, యంగుళీపల్లవంబులు హస్తమెత్తి. 16

వ. పార్వతియు బహుమానపురస్సరంబుగా నయ్యుర్వీసురవటునకు నతిథిపూజ యొనర్చిన
నతండును గొండరాచూలి చేయుసత్కారం బంగీకరించి ముహూర్తమాత్రంబు
విశ్రమించి మేలువడిచూపునం జూచి ప్రస్తావనోచితంబుగా నిట్లనియె. 17

సీ. సలిలంబు త్రిషవణస్నానక్షమం బౌనె, యంభోజపత్రదీర్ఘాయతాక్షి!
కుసుమంబులును నిధ్మకుశపల్లవంబులు, సులభంబు లై యున్నె సుందరాంగి!
సత్త్వంబు లన్యోన్యజాతివైరముఁ దక్కి, శాంతి గైకొని యున్నె చంద్రవదన!
యనుదినంబును దేహయాత్ర కాయిత మూనె, నీవారపాకాగ్ని పూవుఁబోణి!

తే. శక్తికొలందిఁ దపశ్చర్య సంఘటింతె. ఫలముపై నాస నాగ్రహబంధ ముడిగి
తామ్రబింబోష్ఠి ధర్మసాధనములందు, నాద్య మగుసాధనంబు దేహంబ కాదె. 18

క. మగువా! నీ పెంచినలత, చిగురున ముకుళంబు నల్లసిల్లెనె చెపుమా
పగడపుఁగెమ్మోవిపయి, న్నగ వుదయించినవిధంబునం బ్రస్ఫుటమై. 19

క. పంకజలోచన! కరద, ర్భాంకురములు మేసినట్టి యపరాధమునన్
రంకుమదపోతకంబుల, జంకింపవుగా తపఃప్రశాంతి వెలితిగాన్. 20

తే. అభ్రవీథిపరిచ్యుతం బైనయట్టి, యమరతటినీ జలప్రవాహమ్ముకంటె
ధరణిధరరాజు నీచరిత్రంబుకతనఁ, బరమపావనుఁ డయ్యె నోపద్మనయన!. 21

వ. సంబంధంబు సాప్తపదీనంబు గావున నంతతడవు నీతోడఁ గదిసి పలుకు చునికిం
జేసి యే నాప్తుండఁ గావున నొక్కమాట యడిగిన బ్రాహ్మణజాతిస్వభావసులభం
బైన చాపలంబుఁ జూచి హెచ్చు గుందాడం బని లేదు రహస్యంబుగా కుండె
నేనిం జెప్పుము. 22

సీ. ప్రథమప్రజానాథపావనకులమునఁ, బ్రభవించి తబల! ప్రపంచసార
సౌందర్యసంపద నడిసన్నదానవు, నశ్వరం బైశ్వర్యనైపుణంబు
సౌఖ్యంబు నిరవధి సర్వసామగ్రి నీ, యలచేతిభాగ్య మత్యాయతంబు
భాగ్యంబు నీకేమి భ్రాంతి యైనది మనో, రథ మేమి చెప్పుమా రాజవదన

తే. దుష్కరం బైనతప మిట్లు దొడరి చేసి, మేను దయ్యించుకొనఁగ నేమిటికి వచ్చెఁ
జిత్తము విచారమార్గంబుఁ జేరఁదెచ్చి, తత్త్వముఁ దెలియఁ జెప్పు చూతము మృగాక్షి.

వ. పితృగేహంబున నవమాసంబు పుట్టదు గదా! పన్నగఫణారత్నంబుమీఁదఁ జెయిసా
చువాఁడు గలండే. నిండుజవ్వనంబునకుం దగినవిభూషణంబులు తొలంగం బెట్టి
వార్ధకోచితంబు లగువల్కలంబు లెట్టులు ధరించితివి దేవలోకనివాసంబున కాసప
డెదేని నది వృథాశ్రమంబు! నీపుట్టినిల్లు దేవభూమియకదా? తగినవరునింగామించి
సమాధి వహించితి వేని నదియు నీకుం దగదు రత్నం బొకనిచే నన్వేషింపఁబడుఁ

గాని యొరు నన్వేషించునే. నిట్టూర్పుగాడ్పులచే దుగ్ధభజనానురాగంబు నీయందు దేటపడుచున్నది. అట్టి కఠినహృదయుం డెవ్వండొకో వాఁడెవ్వని నపేక్షించియేని నీవు తపంబు సేయుచుఁ గలమా గ్రపింగళం బగుజటాభాగంబు గరియింవఁ దగదని యంత నిలువక యక్కపటవటుండు. 24

ఉ. ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్య వెంత కా
లానకు నీకుఁ బెండ్లియ ఫలం బగునేని విచార మేల స
న్మానముతోడ నచ్చునను మాన్య వివాహము గన్ము లెస్స కా
దేనిఁ దపంబులోనిసగ మిచ్చెద మాను తపోభిమానమున్. 25

వ. అనినం బార్వతి యమ్మిథ్యావటునకుం దనమనోరథం బెఱింగింప నొల్లక వయస్యం గన్నుసన్న సేసిన నచ్చెలికత్తియు నత్తపోధనకుమారునితో నిట్లనియె. నయ్యా! నీకుఁ గుతూహలంబు గలదేని వినుము కాలకంఠకఠోరకంఠహుంకారప్రవర్తకం బగు పుష్పచాపునిసమ్మోహనాస్త్రం బీకన్యహృదయంబున నాటిన నాఁటంగోలె లలాటచందనధూసరాలక యై తుహినసంఘాతతతశిలాతలం బగుజననినింట ధృతిం జెందక మహేంద్రప్రభృతు లగుదిగీశుల నుజ్జగించి పినాకపాణిం బతిఁ గాఁ గోరి తపంబు సేయ సమకట్టె సబాష్పకంఠస్ఖలితంబు లగుసంగీతాక్షరంబుల విరూపాక్షుచరిత్రంబు పాడుచు వనాంతసఖు లగుకిన్నరరాజకన్యకల వగపించుచుఁ ద్రిభాగశేషంబు లగునిశాసమయంబుల నించుకించుక నిద్రించుచుఁ గలఁ గాంచి నీలకంఠ! యెచ్చోటికిం జనియెద వని యసత్యకంఠార్పితబాహుబంధన యయ్యును విరహవ్యథాదుస్సహంబగుతపోభారంబున భర్గు వశీకరింపం దలంచి యున్నయది యనిపల్కిన.

చ. వికవిక నవ్వి యక్కపటవిప్రకుమారుఁడు మేలు లెస్స వా
నికి నయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి మీ
సకియ వివాహవేళఁ బురశాసనుపాణిఁ బరిగ్రహించుచో
మొకమున బుస్సుమంచు నహి మ్రోఁగిన నెట్లు భయంబు చెందునో. 27

సీ. రాయంచ యంచుఁ జీరకు జోక యగుఁగాక, పచ్చియేనికతోలుఁబచ్చడంబు
హరిచందనాస్పదం బగుచనుఁగవమీఁదఁ, బట్టుఁ జేకొనుఁగాక భసితధూళి
కమనీయచరణలాక్షారాగలేఖచే, ముద్రితం బగుఁ గాక రుద్రభూమి
కలితముక్తాఫలగ్రైవేయకంబుతోఁ, దులదూఁగుఁ గాక పెంజిలువపేరు

తే. మనువు లెస్సయి యుండెఁ బో మానవతికి
నివ్విధం బన్న లోకంబు లెల్ల నగరె
యహహ! ముదిగొడ్డు నెక్కి భిక్షాటనంబుఁ
జేయఁ బోవుట యదియు మేల్చాయ చువ్వె. 28

ఉ. పుట్టు వెఱుంగ నెవ్వరికిఁ బోలదు మూఁడవకన్నుఁ జూచి చే
పట్టఁడు వెఱ్ఱివాఁ డయినఁ బ్రాణహరుం డఁట జంతుకోటికిన్
గట్టినతోలుచీర కలకల్మి ప్రకాశము సేయుచున్న దె
ప్పట్టునఁ జూచినన్ శివునిపైసి యెఱుంగఁగరాదు భామినీ. 29

తే. మాటిలేటికిఁ జాలింపుమా తపంబు. హరునిఁ గూర్చి సరోజపత్త్రాయతాక్షి!
వలదు తిరియంగఁ బాఁతినవాఁడికొఱ్ఱు, యూపసత్క్రియకర్హమైయున్నె చెపుమ.

వ. అనిన నక్కపటవటునకు నవ్వధూటి యిట్లనియె. 31

ఉ. చాలు వివాదము ల్పదిగ శంభునిగూర్చి యిట్టిపల్కు లీ
వాలముచేసి పల్కితివి యైనను నా విను చంద్రమఃకళా
మౌళిపయి న్మదీయ మగుమానస మెంతయుఁ జిక్కె నింక నేఁ
జాలుదు నయ్య యెమ్మెయి భుజంగవిభూషణునిం దొరంగఁగన్. 32

వ. అని జయావిజయులం గనుంగొని యపాంగంబులఁ గెంపు గదుర నీబ్రహ్మచారి శం
కరుని గుఱించి యింకను శంకరకొంకక మాటలాడ నుంకించుచున్నవాఁ డితని మెడ
పట్టి నూకుం డని పల్కి కోపావేశంబున. 33

చ. జిలుఁగగువల్కలాంచలము చెన్నయి చన్నులమీఁద జాఱఁగా
నలుకఁ దుషారశైలసుత యవ్వలిమోమయి నాలుగేస్వదం
బులు సన్నిభ్రూకుటీకుటిలముగ్ధలలాటముఖేందుబింబ యై
మలఁగి కనుంగొనెన్ భుజగమండను నక్కపటద్విజోత్తమున్. 34

శా. సాక్షాత్కారముఁ జెందె నవ్వుడు గిరీశానుండు ధాత్రీధరా
ధ్యక్షాపత్యముఁ బ్రేమనిర్భరకటాక్షాలోకనప్రౌఢిమన్
వీక్షించెన్ దరశాక్షియు న్మనమున వ్రీడాప్రమోదక్షమా
దాక్షిణ్యంబులు సందడింప నిలిచెం దత్సన్నిధానంబునన్. 35

చ. అరుదగునీతపమ్మునకు నమ్ముదువోయితి నేలుకొమ్ము నీ
వరువడ నంచు శూలి ప్రియవాక్యములం దగ గారవింపఁగా
ధరణిధరేంద్రనందన యదగ్రతపోమహనీయ వేదనా
భిర మఖిలంబు వీడ్కొలిపి భావమునం బరితోష మందుచున్. 36

వ. జయవిజయ లనుప్రాణసఖులతోడం గూడ మాతండ్రి హిమవత్పర్వతేంద్రుండు దే
వరకుఁ బ్రమాణీకరింపం బాత్రం బయ్యెను. కన్యకం బితృపరాధీన నగుట దేవర
చిత్తంబున నవధరింపవలయు నని విన్నపంబు సేయించిన. 37

తే. అమృతకరమౌళి యవ్వుఁ గాక యనుచుఁ బలికి, వేడ్క గిరిరాజనందన వీడుకొలిపి
తాఁగిరికేశి దివ్యచిత్తమునఁ దలఁచె, సప్తమునుల నరుంధతీసంయుతముగ. 38

శా. ఆసప్తర్షు లరుంధతీసహితులై యాకాశమార్గంబునన్
భాసందోహము సూర్యచంద్రరుచులన్ భంజింపఁగా డిగ్గి కై
లాసస్థానముఁ జేరవచ్చి కని రుల్లాసంబునన్ హేమపీ
ఠాసీనుం డయి దేవతల్గొలువ గొల్వైయున్న శ్రీకంఠునిన్. 39

మ. పదియార్వన్నె పసిండివల్కలములన్ భాసిల్లు ముత్యాలజ
న్నిదముల్ రత్నమయాక్షతంబులును మాణిక్యంపుఁబాత్రంబులన్
జదు రొప్పన్ ధరియించి యల్పధరణీజాతంబులన్ బోలెఁ గ
ట్టెదురన్ నిల్చినదివ్యసంయముల సంవీక్షించి సంభావనన్. 40

సీ. ఆకాశగంగలో నఘమర్షణస్నాన, మహరహంబును జేయునట్టివారిఁ
బ్రస్థాపితాశ్వచే భానుమంతునిచేత, గురుభావమున మ్రొక్కుఁ గొనెడివారి
నంత్యకాలమ్మునయం దుర్వితోఁగూడ, నుదధిలోపల మున్గ కున్నవారి
సర్గశేషమునకై సాహాయ్య మొనరించి, పరమేష్ఠిచే మెచ్చుఁ బడయువారి
తే. గగనమును లేడుపురవారిక ట్టెదురన, పతిపదంబులపై దృష్టి భక్తి నిడిన
దివ్యచరిత నరుంధతీదేవిఁ జూచి, సమ్మదము నొందె కందర్పశాసనుండు. 41

తే. అంధకారి యరుంధతి నాదరించె, గౌరవంబున భేదంబు కలుగకుండఁ
బెద్దవారికి స్త్రీపుంవిభేద మేల, మాననీయంబు పుణ్యకర్మంబుగాక. 42

క. ఆఋషులఁ జూడ శివునకు, దారపరిగ్రహము వెంటఁ దద్దయుఁ దగిలెన్
దారపరిగ్రహమే కద, సారపుధర్మముల కెల్ల సాధన మరయన్. 43

ఉ. పర్వతసార్వభౌముసుతపై ననురాగము సంప్రరూఢమై
శర్వుని చిత్తవృత్తి కొనసాగుచు నుండుట కానవచ్చుటం
బూర్వపుఁదప్పుఁ జేసి వెతఁ బొందుచు నున్నయనంగుఁ డెంతయున్
నిర్వృతిఁ జెందె నా తనదునీతి ఫలించి తపంబు పండినన్. 44

వ. అప్పుడు సప్తర్షులు హర్షవినయభక్తిశ్రద్ధావిశ్వాసతాత్పర్యంబులు మనంబునం బెనఁగొనంగఁ గేలుదోయి మొగిచి ఫాలభాగంబునం గీలించి కంటకితకపోలభాగులై దేవా! యింతకాలంబునకుం గదా మాతపోదానాధ్యయనయజ్ఞవ్రతాదిధర్మంబులు ఫలియించె భువనాధ్యక్షుండవైన నీవు మనోరథాగోచరం బైనమన్ననం జేసి మనోవిషయంబున మన్నించితి వింతకంటెను భాగ్యంబు గలదే యెవ్వానిచిత్తంబున నీవు వర్తింతువు వాఁడు కృతార్థుండు గదా నీచిత్తంబున వర్తించుమాకృతార్థత్వంబు వేఱె వర్ణింప నేల? భవత్సంభావనావిశేషంబునయందు మాకు బహుమానంబు ప్రత్యయంబు నయ్యె [illegible] మాయంతరంగంబులయం

దంగీకరించుటకు సకలభూతాంతర్యామి వగునీవ ప్రమాణంబు. మాటలు వేయు నేటికిం
జింతితోపస్థితుల మైనమమ్ము నేపనిపంపునం దలంచితిరో యానతిం డనుటయు. 45

చ. లలితజటాకిరీటసదలంకృత మైనశశాంకరేఖతో
మలరుచి దంతదీధితిసమాజముతోం బొదలంగం జేయుచుక్
బలికె లలాటలోచనుఁడు ప్రస్ఫుటభంగి మునివ్రజంబుతోం
దొలకరి మేఘఘోషములతోం బురణించు సమంచితధ్వనిన్. 46

తే. ఎఱుంగుదురు కాదె మీరు నాహృదయవృత్తి, నాకొఱకు నేఁ బ్రవర్తింతు నేకృతులను
మన్మహామూర్తు లెనిమిది మామలార, భువనరక్షాప్రయోజనంబునక కాదె. 47

తే. విప్రకృతు లైనయబ్బంది వేల్పు లెల్ల, మనఁగఁ గోరిరి సేనాని మత్ప్రసూతి
ననఘులార తృష్ణాతురు లైనవారు, వారివాహంబు ఘనవృష్టిఁ గోరినట్లు. 48

వ. ఏతదర్థంబ పార్వతిని ధర్మపత్నీంగా నపేక్షించుచున్నవాఁడ మాకొఱకు మీరు హి
మాచలంబునకుం బోయి యక్కార్యంబు సంఘటింపవలయు యుష్మత్సంఘటితంబు
లైనసంబంధముల కెవ్వండును వికారంబు పుట్టనేరదభ్యున్నతుండును స్థితిమంతుం
డును నను ధరాభారధూర్వహుండును నగుపర్వతాధరసార్వభౌముండు సంబంధబాం
ధవార్హుండుఁ కన్యార్థంబ యిటు ప్రవర్తింపుఁడు భవత్ప్రణీహితంబు లైనపురాణా
గమాదులం గదా లోకవ్యవహారంబులకు నిదర్శనంబు లై యుండు నీయరుంధతీదే
వియునీ కార్యంబునకు సహాయ కాఁగలదు విశేషించి వివాహశోభనకార్యంబులయం
దుఁ బురంధ్రీజనంబులకుం జనవుచెల్లు నిది శుభముహూర్తం బిప్పుడ కదలి యోషధి
ప్రస్థపురంబునకుం జనుండు కైలాససానుప్రదేశంబులఁ బునస్సమాగమం బగుం
గాత మని శంభుండు విస్రంభగంభీరంబుగా నానతి యిచ్చిన. 49

చ. అతఁడు సమస్తసంయమిజనాద్యుఁడు శైలసుతాపరిగ్రహా
యతుఁ డయి యుండఁగా సురమహర్షివరేణ్యులు ప్రాక్తనప్రజా
పతులు తదాదిగా హృదయపంకరుహంబులతోం బరిగ్రహ
వ్యతికరసంభవం బయినయచ్చపులజ్జ పరిత్యజించుచున్. 50

వ. మహాప్రసాదం బని యంబరమార్గంబున హిమవంతంబు డాయం జని. 51

తే. గగనమున నుండి డిగ్గి సత్కారయుక్తి, వెలిఁగె హిమపర్వతాంతరస్థలమునందు
నిర్మలం బైననిధిలోని నీడఁ దోఁచు, నిందుబింబంబులనుబోలి ఋషిగణంబు. 52

శా. పాదన్యాసములక్ ధరిత్రి పరికంపంబొంద నత్యంతసం
మ్మోదంబుక్ భయభక్తులుక్ మనమునక్ ముట్టఁగ శైలేంద్రుఁ డం
భోదాకారముతోడ డిగ్గినమహాపుణ్యాత్ములక్ సర్వలో
కాదిశ్రేష్ఠుల వేఁ యెదుర్కొనియె నర్ఘ్యాద్యపూర్ణహస్తాబ్జుఁడై. 53

తే. ధాతుతామ్రాధరుఁడు దేవదారుభుజుఁడు, సానువక్షస్స్థలుఁడు వటస్కంధుఁడైన
మంచుగుబ్బలిరాజు సంభ్రమముతోడ, ఋషిసమూహంబు నతిభక్తి నెదురుకొనియె.

సీ. విధిమార్గ మొక్కింత వీసరవోకుండ, నర్ఘ్యపాద్యాదిక్రియాకలాప
మాచరించి వినిర్మలాచారసంపన్ను, లగునమ్మహర్షుల నాదరమున
నంతఃపురానకు నల్లఁ దోడ్కొని పోయి, క్రమముగా నుచితాసనముల నునిచి
స్వాగతకుశలవార్తాను పూర్వకముగ, నతిగభీరప్రస్ఫుటాక్షరముల

తే. వారితో నిట్టులనియె నమ్మేరుసఖుఁడు, గాఢవినయావనతపూర్వకాయుఁడగుచు
హస్తయుగళంబు మొగిచి సంప్రార్థనమున, యావదర్థపదం బగునట్లు గాఁగ. 55

తే. అపయోదసముద్భవం బైనవాన, యనఘ! గలపుష్పజాలకం బైనఫలము
పుణ్యనిధులార! నాగృహంబునకు మీరు, తలఁపుగానిత లంపుగాఁ దారసిలుట. 56

క. రెంటను నేఁ బావనుఁడను, వింటిరె మునులార! మీపవిత్రాంఘ్రులు న
న్నంటుట మదీయమూర్ధము, వెంటంగా నభ్రగంగ వెల్లివిరియుటన్. 57

సీ. స్థావరం బగు మేను పావనత్వముఁ జెందె, భవదీయపాదసంస్పర్శనమునఁ
గడగంటి నాజన్మ కతికృతార్థతఁ బొందఁ, గన్నులారఁగ మిమ్ముఁ గానఁబడసి
యుష్మత్కృపాసమభ్యుదితసంతోషంబు, నిండి దైవాఱె నాహృదయమున
మీ తేజమున నాదు మేనిలోఁ దహతహ, కలుషాంబుపటలంబు గ్రాఁగి పోయె

తే. ననుఁ గృతార్థుని జేయఁ బావనుని జేయఁ, బరమపుణ్యునిఁ జేయ సంపన్నుఁ జేయఁ
దలఁచి యేతెంచితిరి గాని తక్కఁగలదె, కార్య మానతి యిం డార్యవర్యులార! 58

మ. అని పర్జన్యకఠోరగర్జ కెనగా నాడంబరాటోపముం
జెనయం బల్కఁగభీరనిస్వనమునన్ శీతాచలేంద్రుండు ప
ల్కిన నందందఁ బ్రతిధ్వను ల్మణిగుహాగేహంబులం దుండఁగా
నినుమార్పల్కినరీతిఁ దోఁచె నపు డూహింపన్ మునిశ్రేణికిన్. 59

వ. అప్పు డంగిరసుం డందఱిమునులయనుమతి నప్పర్వతేంద్రున కిట్లనియె. 60

క. సర్వము సంపన్నంబగు, నుర్వీధరసార్వభౌమ యుల్లము నీకున్
సర్వోన్నతంబు గాదె య, ఖర్వము లగునీమహాశిఖరములభంగిన్. 61

వ. చరాచరభూతజాలంబులకు నాధారుండ వగునిన్నుం బురాణబ్రహ్మవాదులు విష్ణుం
డని స్తుతింతురు సప్తపాతాళభవనగోళమూలాధారంబ వగునీవు భూభువనంబు
భరియింపనినాఁడు భుజంగమశేఖరుండు మృణాలపేశలం బగుఫణామండలంబున
నిడి భరింప సమర్థుం డగునే నీ సత్త్వాపన్నంబులును నానేకసముద్రావనిచిహ్నంబులు
నగు నీసలిలప్రవాహంబులు భవత్కీర్తిరతీరంబులుం బోలి భువనపావనంబులు. తీర్థ

గూర్ధ్వాధరస్థానంబు లాక్రమించి త్రివిక్రమావతారంబున విరాడ్రూపంబు వహించినవిష్వక్సేను ననుకరించెదవు. నీవు నితరపర్వతంబులకును సాటియే. ఇది యిట్లుండ నిమ్ము మేము వచ్చినకార్యంబు సావధానుండ వయి యాకర్ణింపుము. 62

సీ. ఏవేల్పులకు లేనియీశ్వరశబ్దంబుఁ, దాల్చు నెవ్వాఁడు సుధాధాముతోడ
నవనిప్రధానంబు లైనయంగంబుల, నవరించు నెవ్వాఁడు సకలజగము
నేకతంబున వసియించి యెవ్వనిఁ గంద్రు, యోగీశ్వరేశ్వరుల్ యోగదృష్టి
నెవ్వనిపదము సూక్ష్మేతు బుధులు పున, రావృత్తిశూన్యక మంద్రు తెలిసి

తే. యతఁడు శంభుఁడు విశ్వలోకైకసాక్షి, యతనిగంబుత్తెంచినాఁడు నీయనుఁగుఁగూఁతు
నిమ్ము పెండిలిపెద్దల మేము మీకుఁ, దుహినగిరిరాజ! భాగ్యవంతుఁడ వైతి. 63

సీ. త్రైలోక్యమునకుఁ జంద్రకళాధరుఁడు తండ్రి, తల్లి యోగాక యాతలిరుఁబోఁడి
హరునకు మ్రొక్కి యనంతరం బమరు లీ, కుటిలకుంతలకు మ్రొక్కుదురు గాక
యీతలోదరి నిచ్చి హితబాంధవంబున, నగుదుగాక గురుండ వఖిలపతికి
నీరాజబింబాస్య కారణంబుగ నద్రి, కులము దేవకులంబుఁ గలియుఁగాక

తే. తగినవరునకుఁ గన్యకాదాన మిచ్చు, నంతకంటెను మతి భాగ్య మన్య మేది
తల్లిదండ్రుల కఖిలభూధరవరేణ్య!, సకలయజ్ఞాంగసముదాయజన్మభవన! 64

తే. దాతవఁట నీవు మేము సంధాతలమఁట, గారవపుఁబెండ్లికూఁతురు గౌరియఁట
శంభుఁడఁట పెండ్లికొడు కిది సంప్రదాయ, మభినుతింపఁగఁ దగుఁ బర్వతాగ్రగణ్య!

మ. అని దేవర్షి బహుప్రకారమధురవ్యాహారసందర్భముల్
బనిగొం చుండఁగఁ దండ్రిపార్శ్వమున సద్భావంబు లజ్జాభరం
బున మౌగ్ధ్యంబునఁ దోఁప నమ్రవదనాంభోజాత యై యల్లన
ల్లన లెక్కించుచు నుండెఁ బాణి నవలీలాపద్మపత్త్రంబులన్. 66

తే. భూమిధరరాజు సంపూర్ణకాముఁ డయ్యె
ముదముతో మేనకాదేవి మొగము చూచి
కన్యకాదాన వేళలఁ గలదు చనవు
క్షితి గృహస్థులకంటె సద్గేహినులకు. 67

వ. అనంతరంబ తనకూఁతుఁ గన్యం జూచి హిమవంతుఁడు. 68

సీ. రావమ్మ తల్లి! సర్వజగచ్ఛరణ్యున, కమృతాంశుమౌళికి నైతి భిక్ష
యర్థులై వచ్చినా రాదిమబ్రహ్మలు, ఘనపుణ్యరాసులు గగనమునులు
పరమపతివ్రతా పరిషచ్ఛిరోమణి, యదె యరుంధతి త్రిలోక్యైకవినుత
నీవు కారణముగ నెఱయంగ సిద్ధించె, భాగ్యంబు గృహమేధిఫలము నాకు

తే. అనుచు మ్రొక్కించె బుషులకు నందఱకును, నబ్జభవుకోడలికిఁ దుషారాద్రినాథుఁ
డవధరింపుఁడు శివునియర్ధాంగలక్ష్మి, ప్రణుతి యొనరించె మీ కని పల్కి నగుచు.
తే. ఈప్సితార్థక్రియాసము పేతుఁ డైన, శైలపతిమాట కందఱు సంతసిల్లి
ప్రణుతి యొనరించి యంజలిపాణి యైన, గౌరి నాశీర్వదించిరి గగనమునులు. 70
వ. అనంతరంబ యభిలషితవరసంప్రాప్తిసముపజాతకుతూహల యగునాహంసగమన
నరుంధతి తనతొడలమీఁదఁ గూర్చుండఁబెట్టుకొనియె మునులును వినిశ్చితకార్యులై
వివాహతిథి నేటికి నాలవనాఁ డని ముహూర్తనిశ్చయంబు సేసి పారంధతీసులై
హిమాచలంబు నామంత్రించి చని విశుద్ధంబైనకార్యార్థంబు విన్నవించి యమ్మహా
దేవుం డనుప నిజస్థానంబుల కరిగిరి పశుపతియు నెట్టకేలకు దివసత్రయంబు గడపు
చుండె నట యోషధిప్రస్థపురంబునందు. 71
తే. ఓషధీనాథుఁ డభివృద్ధి నొందుచుండఁ, దిథికి జామిత్రగుణము సంధిల్లుచుండఁ
బర్వతేంద్రుండు సముపేతబాంధవుఁడు, పుత్రికోద్వాహకళ్యాణమునకుఁ దొడఁగె.
తే. నవశుభారంభసంవిధానముల నపుడు, కౌతుకవ్యగ్రకాంతానికాయ మగుచు
ననుపమస్ఫూర్తి సానుమంతునిపురంబు, సకలమును నొక్కయిలుఁబోలె సంభ్రమించె.
సీ. సంతానకద్రుమచ్ఛాయాసమాకీర్ణ, రాజవీథీపరివ్రాజితంబు
ధవళచీనాంశుకోత్తమసమాకల్పిత, మహనీయతరకేతుమండనంబు
సమధికస్తంభకాంచనతోరణావళి, మేళనోత్తేజితము హీరదీప్తి
ప్రతిగృహద్వారపర్యంతసందానిత, సుమగుచ్ఛమాలికాసుందరంబు
తే. గరుడగంధర్వకిన్నరఖచరయక్ష, సిద్ధవిద్యాధరాంగనాశ్రేణిభరిత
మఖిలలోకవిలోచనహర్షకరము, రాజితం బయ్యె నోషధిప్రస్థపురము. 74
వ. మైత్రీముహూర్తంబున నుత్తరఫల్గునీనక్షత్రంబునకుం జంద్రయోగంబు గలుగుచుం
డఁ బతిపుత్రవంతు లగునమ్ముత్తైదువ లమ్మత్తకాశినికి శృంగారంబు సేసి రపుడు. 75
తే. గౌరసిద్ధార్థవినివేశకలిత మగుచుఁ, దరుణదూర్వాప్రవాళసంభరిత మగుచు
నాత్మరక్షాశిలీముఖం బగుచు నపుడు, బాలకభ్యంగనైపథ్యలీల యమరె. 76
క. బంగారుకంకపత్త్రముఁ, గెంగేల ధరించి యొప్పె గిరినందన య
భ్యంగముతఱి భాస్కరకర, సంగత యగువిదియనాఁటిశశికళవోలెన్. 77
సీ. కమనీయలోధ్రకల్కంబునఁ బలుంగునఁ, నభ్యంగతైలంబు నపనయించి
యాశ్యామ మైనకాలాగరుద్రవమున, నంగరాగాలేప మాచరించి
కస్తూరి పునుఁగును గంధసారంబును, సంపంగినూనెయు సంతరించి
యభిషేకవిధియోగ్య మగుమదుంగొలియ్య, నిర్మాలిభిలనుగా నెఱికి గట్టి

తే. చలువ నెల నైన ముత్యాలచవికలోనఁ, బృగులమాణిక్యశశికాంతపీఠియందుఁ
బదియునార్వన్నెపసిఁడికుంభములనీట, జలక మార్చిరి గౌరికిఁ జంద్రముఖులు. 78

వ. మంగళస్నానవిశుద్ధగాత్రియు గృహీతప్రత్యుద్గమనీయయు నై ప్రఫుల్లకాశయగుశరత్కాలవసుంధరయుంబోనిశాశ్వతిం దత్పరిదేశంబులనుండి మణిస్తంభచతుష్టయాభిరామంబును వితానవంతంబును నగు కౌతుకవేదిమధ్యంబునకుం దెచ్చి నెచ్చెలు లలంకరింపం దొడంగి రప్పుడు. 79

తే. అగరుధూపంబు సంపూజితార్ద్రభావ, మంతరస్యస్తసుమమాల్యము తదీయ
మలిమనోజ్ఞంబు ధమ్మిల్ల మలరుఁబోడి, యిప్పపూదండఁ గైసేసె నెలమి నొర్తు. 80

తే. కలితగోరోచనాపత్రకములతోడఁ, గరము విలసిల్లె నీహారగిరితనూజ
చక్రవాకపదాంకితసైకతములఁ, గరము విలసిల్లునాకాశగంగ పోలె. 81

తే. తుమ్మెదలతోడఁ గూడిన తమ్మిపోలె, జలదరేఖాయుతం బైనచంద్రుపగిది
ఫాలమునఁ గుంతలంబు నేర్పఱచినపుడు, నెలవుగాఁ దోఁచె గిరికన్య నెమ్మొగంబు.

వ. మఱియు నొక్కసైరంధ్రి లోధ్రకషాయరూక్షంబును గోరోచనాక్షేపనితాంతగౌరంబు నగునీహారగిరికన్యకాలలామంబుకపోలభాగంబునం బరాగలాభంబు సంధిల్లఁ గర్ణావతంసంబుగాఁ గాయజప్రరోహణంబుఁ గీలించె. నొక్కచంచలాపాంగి మంచుఁగొండరాచూలియధరప్రవాళంబు కించిన్మధూకచ్ఛవిస్పృష్టరాగంబుఁ గావించె. నొక్కయిందుబింబానన యంబికచరణాంబుజంబులఁ గ్రొత్తలత్తుక హత్తించె. నొకకిసలయపాణి చరణపల్లవంబుల ఫాలలోచనుకిరీటబాలేందుని ముట్టు మని నెట్టుకొని దీవించె. నొక్కశాతోదరి కళిందసుతాజాతనీలోత్పలపలాశకాంతిమంతంబు లైనహిమవంతుముద్దుఁగూఁతునిద్దంపువెడందసోగకన్నులం గాలాంజనంబు మంగళార్థంబుగా రచియించె. నప్పుడు కుసుమంబులతోడ లతయును నక్షత్రగ్రహతారకంబులతోడ రాత్రియును గలహంససందోహంబుతోడ మందాకినియుంబోలె దివ్యాభరణంబులతోడం గూడి పార్వతి సర్వలోకనయనోత్సవకర యయ్యె నయ్యవసరంబున. 83

చ. ద్రవమయి యున్న క్రొత్తహరితాళమనశ్శిలలం గరంగి ప
ల్లవమునఁ దోఁచి మేనక యలంకరణం బొనరించె గౌరికిన్
నవనవపత్రభంగరచనాకలనంబున మంగళార్థ మ
త్యవిహతలీల రత్నముకురామలకోమలగండమండలిన్. 84

తే. దంతతాటంకమండనోద్భాసి యైన, ముద్దుఁగన్నియయాననాంభోజ మెత్తి
తీర్చి రచియించె మేనకాదేవి రక్తి, మలయజంబునఁ గళ్యాణతిలకరేఖ. 85

వ. ప్రమదవనోద్భేదనం బాదిగా నెయ్యది ప్రతిదినప్రవర్ధితం బయ్యె నది మనోర

ఘంబు ఫలియింప వివాహదీక్షాతిలకంబు లలాటంబునం దీర్చి యధిష్ఠానాంతరసన్ని
వేశం బై ధాత్రీప్రతిసార్యమాణం బైనపూర్ణకౌతుకహస్తసూత్రంబు బంధించి
మేనకాదేవి బాష్పాకులలోచన యయ్యె నప్పుడు నవఫేనపుంజ యగుదుగ్ధాబ్ధివీచి
పోల్కిఁ బట్టుపుట్టంబు గట్టి చెలువారు నాసాగ్రరుహాక్షి కులదేవతలకు మ్రొక్కి
ముత్తైదువల కభివాదనంబు సేసి కళ్యాణమండపమ్మునం దఖిలపరివారపరివృతయై
సింహాసనంబుమీఁదం గూర్చుండి మహోత్సవలాంఛనాగమనంబుఁ బ్రతీక్షించుచు
నుండె నంత. 86

సీ. బ్రాహ్మి సంపాదించె భసితాంగరాగంబు, మాహేశి రుద్రాక్షమాలఁ గూర్చెఁ
గౌమారి వెలయించె గజచర్మచేలంబు, వైష్ణవి తోలుదువ్వలువ మడిచెఁ
వారాహి కెంగేలి గారాపుప్రేలికిఁ, గై సేసె మణిమయాకల్పపఙ్క్తి
నింద్రాణితోఁ గూడి హేరాళముగ గ్రుచ్చెఁ, జాముండ హస్తభూషావ్రజంబు
తే. నాదికాలంబు సతిఁ బెండ్లియాడఁ బోవు, నవసరంబున నెబ్భంగి నవదరించె
దివ్యశృంగార మబ్భంగి దేవదేవుఁ, డాదరించెను సమ్మోద మావహిల్ల. 87
సీ. భసితంబు కర్పూరపాళికస్తూరికా, భరితాంగరాగసంపద వహించెఁ
పచ్చియేనుఁగుతోలు పసిఁడికమ్ములపట్టు, పచ్చడం బనెడివిభ్రమముఁ దాల్చె
భుజమధ్యమునఁ గ్రాలు భోగిభోగంబులు, తారహారములచందంబు నొందె
జేగుఱించినకెంజిగురుచాయలతీఱు, సిందూరతిలకంబు చెలువు నించె
తే. దినమునందును వెన్నెల దీటుకొనఁగ, శైశవంబున విగతలాంఛనతఁ జెంది
చాల నొప్పారుసుకుమారచంద్రరేఖ, తనకుఁ దాన చూడామణిత్వము వహించె. 88
వ. ఇవ్విధంబున గంగాధరుండు సమాసన్నగణోపనీతం బైనఖడ్గంబున నీడఁ జూచి నం
దిభుజావలంబియై శార్దూలచర్మపిహితపల్యాణబంధం బగువృషభంబును కైలాసశిఖ
రంబుంబోలె నారోహణంబు సేసి బ్రాహ్మి మొదలయినమాతృకలును గపాలాభరణ
యైనభద్రకాళియు భృంగిరిటనికుంభధర భద్రకాళ ప్రముఖ ప్రమథపరివారంబు
నుం బరివేష్టింప భూతబేతాళశాకినీడాకినీగణంబులు మురాయింపం ద్వాత్రింశ
త్కోటిదేవతాసమూహంబులుఁ గొలువ సహస్రరశ్మిధవళాతపత్రంబు ధరియింప
గంగాయమునలు వింజామర లిడ నుభయపార్శ్వంబుల నిజవాహనారూఢులై
హరివిధాతలు వేత్రహస్తులై తలంగుండు పొమ్మం డొలంగుం డనుచు సందడి
నెడఁ గలుగఁ జేయఁ గలహాశనతుంబురులును విశ్వావసుప్రముఖులును హాహాహూహువు
లును త్రిపురవిజయాదివిద్యాధరులును త్రిపురవిజయాదికంబు లుగ్గడించుచుండ సప్త
ర్షు లరుంధతీసహితంబుగా మంగళద్రవ్యంబులు సంతరించుకొని నడువ నాకాశమా

ర్గంబునం జామీకరకింకిణీక్వాణంబులు సెలంగ ముహూర్తంబునకు నగేంద్రగుప్తం బగునోషధిప్రస్థపురంబునకుం జని తదీయోపకంఠంబున డిగ్గిన. 89

మ. వనగంధద్విపరాజి నెక్కి యధికవ్యాయామవిస్ఫారిసం
హననుల్ బంధులు మేదినీధరము లుద్యత్కీర్తితోఁ దోడు రా
మనమందుం బ్రమదంబు పొంగ దివిషన్మాన్యుండు ధీరుం డెదు
ర్కొనె నీహారగిరీశ్వరుండు సుమనఃకోదండసంహారునిన్. 90

వ. ఇట్లెదుర్కొని తుషారగిరీశ్వరుండు మేనకాదేవి పసిఁడిపాత్రంబుల జలంబు వోయ సురాసురకిరీటమణిశాణోత్తేజితంబు లగుపురాసురాంతకునిపదంబులు గడిగి కన్యాదానం బొనరించె నంతం దుషారగిరికన్యకాశంకరులు సంకల్పసిద్ధి వడసిరి నిర్వర్తితపాణిగ్రహణమహోత్సవులై భవానీభర్గులు భక్తిభావనావశంవదులై బ్రహ్మాసనాసీనుం డగుపితామహునకుం బ్రణమిల్లిరి చతురంతవేదికామధ్యాధ్యాసీనులై పార్వతీసర్వజ్ఞులు లౌకికం బైనయార్ద్రాక్షతారోపణం బనుభవించి రంత.

సీ. అమృతబిందువులు పై నందంద చిలుకంగఁ, బద్మాతపత్త్రంబుఁ బట్టెఁ గమల
కళ్యాణసమయార్హగద్యపద్యంబులఁ, గైవార మొనరింపఁ గడఁగె వాణి
రంభోర్వశీముఖ్యజంభారివనితాళి, తూర్యత్రయంబునఁ దోడు సూపె
మందాకినియును గాళిందియును నిరుచక్కి, రమణఁ బై వింజామరంబు లిడిరి
తే. వేళ యెఱిఁగి మహేంద్రాదివిబుధగణము, ముకుటముల హస్తపల్లవములు ఘటించి
వేఁడుకొనిరి మహాదేవు వినతు లగుచుఁ, జిత్తసంభవునకుఁ బునర్జీవనంబు. 92

సీ. సంబంధబాంధవసరదనుగ్రహముచే, నచలాధిపతిఁ జరితార్థుఁ జేసి
కందర్పుఁ దొల్లింటికంటె నున్నతుఁ జేసి, రతిదేవిహృదయవైరాగ్య ముడిపి
పెండ్లికి వచ్చినబృందారకుల నెల్ల, వివిధసంభావన వీడుకొలిపి
ప్రమథవర్గము నికుంభప్రధానస్థుని, బేతాళడాకినీవితతి ననిచి
తే. కనకకలశాదిభక్త్యలంకారయుతము, నైనకౌతుకరత్నగేహంబు సొచ్చి
పార్వతియు దాను నీహారభానుమౌళి, పవ్వళించెను ముదముసఁ బాన్పువీఁద. 93

వ. అనంతరంబ గంగాధరుండు భృంగిరిటవికారంబుల నిగూఢంబుగా నవ్వించియు, పాదసాంత్వనపరిగ్రహంబున మందమందాత్మసారంబు గారచించియు గాఢాలింగనంబులును నీవీబంధస్పర్శనంబులును బింబాధరచుంబనంబులును నఖాంకురవ్యాపారంబులును దంతక్షతవేదనాప్రపంచితకిలికించితంబులును వెలయ బాహ్యాంతరోత్సవప్రదేశంబులు సంధించి మన్మథుం గృతార్థుం జేసి యనేకకాలంబు పరమానందంబుఁ జెంది శతానందముకుందపురందరాదులకు మిత్రంబుగ సుతుం గాంచి యాంబికే

యుండును గాంగేయుండును గార్తికేయుండును షాణ్మాతురుండును ననునక్కుమారునివలనఁ దారకాసురు వధియింపించి మహాదేవుండు లోకంబు లన్నియు రక్షించెనిది గౌరీకళ్యాణము. 94

క. ఈగౌరీకళ్యాణము, భోగీంద్రధరాపదానపుణ్యప్రతిధీ
ర్యాగము దీనిం జదివిన, భోగము మోక్షమును గలుగు భూజనములకున్.

## ఆశ్వాసాంత్యము.

చ. కొమరగిరిక్షమారమణకుంజరచారువసంతవైభవ
క్రమసముపార్జితాభినవగంధహిమాంబుకురంగనాభికుం
కుమఘనసారసంకుమదకుంభమనోహరగంధపాళికా
సముదయసార్వభౌమ! కవిసంఘమనోభవకల్పకద్రుమా! 96

క. కరదీపదానబిరుదా, ధరణా! కావేరివల్లభా! సుగుణనిధీ!
శిరియాళవంశశేఖర!, హరచరణస్మరణపరిణతాంతఃకరణా. 97

పంచచామరము. హరాట్టహాసమల్లికాశశాంకశంకరాచలా
సురాపగాసరస్వతీసమానకీర్తిమండలా!
కురంగనాభిగంధసారకుంకుమాదివాసనా
పరంపరావితీర్ణశస్తహస్తపల్లవా!. 98

గద్య. ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథ నామధేయప్రణీతం బయినహరవిలాసం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



# పంచమాశ్వాసము.





శ్రీమత్కుమారశైల
స్వామికృపాఽబ్ధసిత్యశాశ్వతవిభవా !
హేమాచలధీర ! ధరి
త్రీమండనచరిత ! యవచిదేవయతిప్పా ! 1

వ. ఆకర్ణింపుము. 2

ఉ. గౌరి వివాహమై కుసుమకార్ముకుఁ గ్రమ్మఱిలంగఁ జేసి బృం
దారకవర్గము స్నిజపదంబులఁ గన్పి హిమాచలంబుపైఁ
బారిషదవ్రజంబు దను భక్తి భజింపఁగ నాదరించె సం
సారసుఖంబు శంకరుఁడు సంభృతనవ్యకుటుంబభారుఁడై. 3

తే. ప్రమథగణములతో మాతృసమితితోడ, నందికేశ్వరుతోడ నానందలీల
నాగ్యపైఁ జేర్మి యెట్టివో యద్రియింట, సిల్లటం బుండెఁ ద్రిభువనాధీశ్వరుండు.

సీ. జమిలిపాములతోడిసాకత్రం బొల్లక, సవరించు బంగారుజన్నిదములు
పచ్చయేనికతోలుపచ్చడంబుఁ ద్యజించి, గడితంపుఁబట్టుఁబచ్చడముఁ గట్టు
భస్మాంగరాగంబు పనికట్టువడఁ జేసి, కస్తూరితోడ శ్రీగంధ మలఁదు
నస్థిమాల్యములపై ననురక్తి వర్జించి, రమణీయతారహారములు దాల్చు
తే. జడలు బాగడ జొల్లెంబు సంతరించి, లేఁతరిక్కలరాయుఁ గీలించు నందు
మంచుగుబ్బలియింట సమ్మదము మీఱ, మనువుఁ గుడువంగ నున్నపుడు మదనవైరి. 5

తే. ఓషధప్రస్థపురమున నుబ్బియుబ్బి, హేమపుఁజప్పరంబుల నెక్కియాడు
గణము లిరువంకఁ గొలిచిరాఁ గాలగళుఁడు, వృషభపుంగవువాహ్యాళి నెడలునపుడు.

ఉ. ఆరభటీకఠోరతరహాసు లుదంచితచంద్రహాసు లిం
గారనిభారుణాక్షులు ప్రకారవిశాలమనోజ్ఞపక్షు లా
కారధురంధరుల్ ప్రకటకంబుమనోహరకంధరుల్ జటా
ధారులు మేరుధీరులు సదాశివుసన్నిధిపారిపార్శ్వకుల్ 7

తే. వీటఁ దనకెవ్వ రెదురని వెఱపులేక, చెల్లుబడిఁ బ్రల్లదంబులు సేయఁ దొడఁగి
భవులెంకలు జమునిమారంకకార్లు, వేశవాటీకటీమధ్యవీథులందు. 8

క. కుంభోద్భవుపాలెమున ని, కుంభుని వాణమున భృంగి కులపతిగాఁ గాఁ
గుంభోద్భవువగఁ దిటగిరి, శంభునికింకరులు గర్వసంరంభమునన్. 9

సీ. పులికళాసంబు గప్పుదురు పాఱఁగ మీఁద, విద్యాధరాంగనావిటగణంబు
గంధర్వకామినీకాముకవ్రాతంబు, లాతాలఁ గొని మోఁది లజ్జ గొండ్రు
కకపాలవెలిబూదిఁ గన్నులలోఁ బ్రామి, బాధింతు రప్సరఃపల్లవకుల
గిరుడభామాభుజంగప్రతానముఁ బట్టి, బాధింతు రురుయోగపట్టకముల
తే. నాగడీలు మహాధూర్తు లగడుఁగాకు, లుద్ధతులు గొంట్లు పలుగాకు లుదురుమిడు
కు లాకతాయలు శతులు గయ్యాళు లగుచు, నోపనిప్రస్థ మిల్లిల్లు నడుకుచుండ. 10

వ. మఱియు నానాప్రకారంబులం బ్రమథజటాధారులు యథేచ్ఛాచారులై యోషధి
ప్రస్థపురంబునందు క్షుద్రోపద్రవంబులు సేయుచుండ హిమవంతుం డంతయు నెఱిం
గి మేనకాదేవియుం దాను మంతనం బుండి యీశ్వరునితోడిపొత్తింతియు చాలు
నని యాప్రొద్దు కూఁతు రావించి యి ట్లనియె. 11

క. కమలాక్షి యసంఖ్యాత, ప్రమథగణంబులును భూతపరిషత్తుఁ బిశా
చములుఁ మొదలగు ధూర్తుల, సమూహమును నీమగండు సంభావించున్. 12

క. భూతప్రేతపిశాచ, వ్రాతంబులు తోడు గాఁగ, బ్రమథులు పగలుఁ
రాత్రియును నష్టాదశ, జాతిప్రజలకును దుర్దశలు సంధింతుర్. 13

ఉ. వేమఱు రాత్రియుం బగలు వీథులఁ గల్పలతాప్రసూనమా
ధ్వీమదమత్తచిత్తు లయి వేలుపులేమలఁ బట్టుకొండ్రు నీ
స్వామికి నిష్టభృత్యు లనుజంగమ ముండ కపాలపాణి కా
ళాముఖవీరపాశుపతలాంఛనధారులు ధూర్తవర్తనుల్. 14

క. ఈవీట నసంఖ్యావలి, ద్యావాపృథివీమహామహత్తులకుఁ ద
ర్పావేశంబున ధూర్తత్వము, గావింపఁగ మాన్పఁ దగదె కఱకంఠునకున్. 15

సీ. తలమీఁదిచదలేటిదరిమీలఁ దినఁ జేరు, కొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ
మెడదన్ను పునుకలనిడుపేరు లొండొంటిఁ, బొరిఁబొరిఁదాఁకి బొణ్బొణుగు రనఁగఁ
గట్టినపులితోలుకఱకొంగు సోఁకి యాఁ, బోతుకత్తడి చిట్టుబుట్టు మనఁగఁ
గడియంపుఁబాములు కకపాలలోనున్న, భూతి మైఁ జిలికిన బుస్సు రనఁగ
తే. దమ్మిపూఁజాలిపునుకకంచమ్ము సాఁచి, దిట్టతనమున బిచ్చము దేహి యనుచు
వాడవాడల భిక్షించుకూడు గాని, యిట్టిదివ్యాన్నములు మెచ్చునే శివుండు. 16

తే. అఖిలలోకేశ్వరుఁడు మామ యాత్మలోని, వినువుఁ జారజనంబుల వేసటయును

ప్రమథగణములు నేయుధౌర్త్యంబు నెఱిఁగి, దారుకావని కరుగంగఁ దలఁచె నపుడు.

వ. ఇట్లు దలంచి నందివాహనారూఢుండును గతిపయప్రమథపరివారపరివృతుండును నై మామ వీడుకొనక గౌరికిం జెప్పక నభోమార్గంబునఁ దప్పర్వతైకదేశస్థితం బగు దేవదారువనంబుం బ్రవేశించె నప్పర్వతం బెట్టి దనిన. 18

సీ. వృద్ధకచ్ఛపరాజువీఁ పంఘ్రిపీఠంబు, సురతరంగిణి వెల్లి శిరసుపాగ
మహిమండలమునకు మానదండము మేను, పూర్వాపరంబులు పొరుగుటిండ్లు
కాత్యాయనీదేవి కన్యకారత్నంబు, బేసికన్నుల వేల్పు పెండ్లికొడుకు
పాలసీయము శేషశైలసామ్రాజ్యంబు, యాగహవిర్భాగ మోగిరంబు
తే. మాల్యవన్మేరుకైలాసమలయసహ్య, గంధమాదనమందరక్రౌంచవింధ్య
భూధరంబులు చుట్టాలు పొగడఁ దరమె, సకలగుణధాముఁ బర్వతసార్వభౌము. 19

క. అందు విహరించుఁ గాంచన, కందరమందిరములందుఁ గౌతుక మొప్పన్
బృందారకమిథునంబులు, కందర్పవిహారములఁ బగళ్లును రేలున్. 20

ఉ. ఎంచి నుతింప శక్యమె యహీశ్వరునంతటివాని కైన ర
త్నాంచితగోచిరుద్ధమునిరస్తరవీందుమరీచిజాలముల్
గాంచనకందరాయవగికాయితవారిధరాంతరాళని
ర్వ్యంచితదేవతామిథునవాంఛితమూలము శీతశైలమున్. 21

తే. హేమశైలంబు దోగ్ధ గా భూమి సురభి, నఖిలరత్నౌషధులును గల్పాదియందుఁ
బృథుమహారాజుపంపునఁ బిలికె నెలమి, మంచుగొండను బెయ్యఁ గావించి గిరులు.

శా. ఆమోదంబున వేఁటలాడుదురు నీహారాద్రికాంతారరే
ఖామధ్యంబునఁ జాపటంకృతులతో గంధద్విపశ్రేణులన్
క్షామక్షామమనోజ్ఞమధ్యపలు గుంజాభూషణాలంకృతల్
వ్యామగ్రాహ్యపయోధరల్ శబరసేనాధీశసీమంతినుల్. 23

క. మృడు మేనిసాము కూఁతురు, జడనిధిచెలికాఁడు కొడుకు సర్వంసహయున్
గొలకోల కడలికపలసె, వడఁకులగుబ్బలికి సరియె వసుధాధరముల్. 24

క. ఆటవికభామినీభుజ, తాటంకితదీర్ఘదీర్ఘతరవేణుధను
ర్జ్యాటంకారధ్వనిపటి పాటీముఖరములు తుహినపర్వతతటముల్. 25

వ. మఱియు జాహ్నవీనిర్ఘరధారాఘూత్కారఘుమఘుమాయితమణిగుహాకుహరంబును వనమహిషశోణాభిఘాతప్రస్నిగ్ధపాషాణస్థలనగోహద్గర్భిణీగర్భపాతంబును శబరపురంధ్రీనీరంధ్రకుచకలశలేపనముద్రాయోగ్యవర్ణవర్ణనీయగైరికశిలాచూర్ణంబును గిన్నరమిథునక్రీడాసంకేతనికేతనాయమానకనకకేతకీకుంజక్రోడంబును గంధర్వకన్యకానఖముఖస్ఫాల్యమానవీణాగుణక్వాణసంగీతభంగీతరంగితాంతరంగవనకురంగంబును

విద్యాధరాభిసారికామనోరథపదానురోధనిర్ణిరోధనిరవగాధసంబాధపృథుల తమతమాలవీథీతిలకంబును నైనయక్కొండదక్షిణభాగంబున నుండుదాక్షాయణీ వనంబున కనతిదూరంబున. 26

సీ. కర్ణికామాణిక్యకనకపద్మినులతోఁ, గల్పవల్లీకుడుంగములతోడ
విమలచింతారత్న వేదికాస్థలులతో, సిద్ధరసాపగాశ్రేణితోడ
దివ్యలోకాప్సరస్త్రీనికదంబముతోడఁ, గామధుగ్ధేనుసంఘములతోడ
దివ్యౌషధీలతాదీపమాలికలతో, సకలర్తుసన్నివేశంబుతోడ
తే. మదనవైరికి గారాపుమామ యైన, మంచుగుబ్బలిశైలసీమాంచలమున
దేవతామునిసేవ్యమై తేజరిల్లు, ధర్మసంజీవనము దేవదారువనము. 27

క. అందు వసియించుసంయమి, సందోహము పంచబాణసదృశము లీలా
సౌందర్యకళానిర్జిత,బృందారకసతులు వారిబింబాధరలున్. 28

సీ. జిలుఁగైనకనకంపుఁజీనాంబరముకొంగు, పాలిండ్లబింకంబు బయలుపఱుప
భ్రమరకంబులఁ జుట్టుప్రస్వేదకణములు, నొసలికస్తురిబొట్టు నూలుకొలుప
దరవిశ్లథంబైనధమ్మిల్లభారంబు, చిమ్మచీఁకటులకుఁ జిట్టమిడువఁ
దరళహాటకరత్నతాటంకదీప్తులు చెక్కుటద్దములపై జీరువాఱ
తే. బసిఁడికుండల నిర్ఝరాంభస్సుఁ దెచ్చి, పోయఁ గంకణనిక్వాణములు సెలంగఁ
గన్యలకలను మునికన్యకాకదంబ, మభిమతంబైనయప్పావనాశ్రమమున. 29

క. జ్యోతిష్టోమాదిముఖ, త్రేతానలపుణ్యధూమరేఖామృతగం
ధాలిరయం బక్కఁగించుం, బాతకసంఘము తదీయపర్యంతమునన్. 30

ఉ. సమ్మదలీలతోఁ జదువు సామము లేదును కందుఁగోయిలల్
తుమ్మెద లాలపించుఁ బరితోషమునం బ్రణవాక్షరంబులన్
సమ్మతిఁ బ్రస్తరించు శుకశారిక లాగమభాషితంబులన్
నెమ్మదిఁ జెప్పు శాస్త్రములు సేలగళంబులు తద్వనంబునన్. 31

శా. కాముం జీకిఁ గొనక క్రోధము నహంకారంబు లోభంబు సీ
ర్ష్యామాత్సర్యమదావలేపకుహనారాగంబులం జేర సీ
కాముష్యాయణు లై ప్రశాంతమతులై యయ్యాశ్రమాంతంబులన్
సేమం బొప్పఁగ సంచరింతురు మునుల్ నీవారముష్టింపచుల్. 32

శా. ఆనందంబునఁ బ్రుద్ధపుచ్ఛములు పెల్లల్లాడ్చుచున్ లేగల
క్కానన్ గోవులగోష్ఠదేశముల జంఘాలాఘువం బొప్ప హో
మానుష్ఠానవిధిప్రకారపరతంత్రాత్మప్రసూకామధు
గ్ధేనోదస్యసుధాప్రవాహలహరీతృప్తాంతరంగంబులై. 33

శా. ఆయావేళల మౌనిభార్యలు గృహవ్యాపారలీలాభవ
త్కాయక్లేశము బుజ్జగింత్రు విలసత్కాసారరంభాతరు
చ్ఛాయన్ శీతలచంద్రకాంతమణిపాషాణప్రదేశంబులన్
వాయుప్రేరణఁ బచ్చకప్పురము పై వర్షింప నక్కాననలోన్. 34

వ. మఱియు నత్తపోవనంబునందు. 35

క. నిలయవ్యాపారంబుల, నలపుల మేనులు చెమర్చి యపరాహ్ణమునన్
సెలయేఱులలోఁ జిల్లులు, చిలుకుదు రానుదురు మునులచివురుంబోణుల్. 36

సీ. సెలయేఁటి తెలినీటఁ జిఱుబంతిపస పాడి, నేసక్రొమ్ముళ్లఁ బచ్చియలు తుఱిమి
గురువింద పేరులు గుబ్బచన్నులఁ దాల్చి, నెమిలిపించంపుఁబుట్టములు గట్టి
పయ్యెదమాఱుగాఁ బొఱుటాకు లమర్చి, చాఁదునఁ దిలకంబు సంతరించి
కంకేళిచిగురాకుఁ గర్ణపూరముఁ జేసి, కుసుమపూవులధూళిఁ గురులఁ దాల్చి

తే. చెంచుఁజిగురాకుఁబోణులచేఁత లెల్ల, నభినయింతురు పర్ణశాలాంతరములఁ
దండ్రు లెందేఁగ జననప్డు తల్లులెదుర, గారవము సేయ మునికన్యకాజనంబు. 37

సీ. నిర్ఝరాంభఃకేళి నీలకంఠాంగనా, తాండవాడంబరదర్శనంబు
పుష్పాపచాయంబు పూర్ణిమాతిథినిశా, చంద్రోదయారంభసంభ్రమంబు
ప్రసవకందుకలీల బాలప్రవాళాచ్ఛ, గిరినదీసైకతక్రీడనంబు
పాంచాలికారక్తి కాంచనకుంభాంబు, పూరకల్పితలతాపోషణంబు

తే. లతిథిపూజార్థ సజ్జీకృతార్ఘ్యపాద్య, సలిలమధుపర్కలాజకుశప్రవాళ
గంధపుష్పాక్షతాదిప్రగల్భనములు, ప్రత్యహఃకృత్యములు మౌనిబాలికలకు. 38

వ. మఱియు నద్దేవదారువనంబునందు మునులవ్రతభంగంబు సేయంబూని యేతెంచిన పదునాల్గుజాతులయప్సరస్స్త్రీకదంబంబులు ప్రతిజాతి కొక్కొక్కవాడ యేర్పడ నానాసంకేతసన్నివేశంబులై తప్పకుండు మార్తాండమండలం బిక్షుదండంబులు మృత్యుదేవతావదనగహ్వరంబు నారాయణోరుకాండం బగ్నిజ్వాలాజాలంబు శంబరారాతిచెఱకువిల్లు ముక్కంటినొసలిచిచ్చఱకన్ను గంధర్వవంశద్వయం బాదిగా బహువిధాన్వయంబుల నుత్పన్నంబు లగుటం జేసి తమతమయుత్పత్తిలాంఛనంబులును, సౌభాగ్యధ్వజపతాకాపటలంబులుం దేటపడఁ బ్రతిభవనభిత్తిభాగంబునం జిత్రించినచిత్తరువులయందుం గోరకితనేత్రత్రిభాగుం డై కుసుమకంకపత్రంబుల వంక లొత్తుచు రతీదేవివృత్తస్తనంబులమీఁద నత్తమిల్లినయుష్మత్తచిత్తభవువిక్రమసంపత్తిప్రకారంబును, బట్టపగలు యోజనగంధ యనుగంధగజగమనవట్రువచనుంగవ నూచి తొట్రుపడుపసిష్ఠపౌత్రుని దృష్టిప్రియత్వంబును, నాచార్యభార్య యగుతారాదేవిమీఁదఁ దారకారాజు పఱపుచిటంబు వాటంబు సేయు లలితకటా

త్మవీక్షావిక్షేపమ్ములును, ధృతిమాలి మాలినీసైకతంబున నేకతంబునం గురువిందపాద లో వేలుపులంజియు కెంజిగురు చవి నూవినకుశికనందనురాగావేశంబును, గుసుమ కోదండజయడిండిమం బగువిభాండకసుతమునివనితామండలాసక్తియు, బృందావ నంబునందు ముకుందుఁ డొనరించినయందవ్రజనధూళిహారాకంబరంబును, నంబురు హనూతి యాఁడుపట్టిం బట్టుకొనినపట్టునుం, బురుహూతుండు గౌతమకళత్రంబు మీఁదం గల్పించిన చీఁకటితప్పును జూఁ జూపలసఁ జిత్తంబు లవ్విళ్ళూర, వేలవేల వసియించియుండువచ్చేడియలలో విబుధమత్తకాశినీజనోత్తమ యగుతిలోత్తమయు వశీకృతకుసుమనారాచ యగు ప్రమ్లోచయు నలకూబరనఖాంకరేఖాంకిత స్తనకుంభ యగురంభయు గుణపేశి యగునుకేశియుఁ గలమంజుఘోష యగుమంజుఘోషయు శృంగారరసరాశి యగునూర్వశియు రూపానురూపస్థాపక యగు మేనకయుఁ గలికి చూపుల హేలాసందర్శిత మేఖలాకలాపంబు లగువ్యాపారంబుల హాటకతులాకోటి ఝుళఝుళత్కారమందరంబు లగుమందరగమనంబుల వికస్వరకపోలఫలకంబులగు మొలక నవ్వుల నమృతరసకూపంబు లగునాలాపంబులఁ ద్రిభువనంబులు వశీకరింతు రట్టిదేవదారువనంబునందు. 39

సీ. నందికేశ్వరు నొక్కనవశాద్వలంబున, హరితాంకురములు మేయంగఁ బనిచి
ప్రమథుల నొక్కసరస్సమీపంబున, లింగార్చనంబుఁ జెల్లింప నునిచి
భూతజాతము నొక్కపులినస్థలంబున, నాత్మేచ్ఛ నుండంగ ననుమతించి
మాత లేద్వురు నొక్కమణికందరంబున, విశ్రామ ముండంగ వెరవుచేసి
తే. పసిఁడికొప్పెర లాతంబుఁ బచ్చకోల, జోగపట్టియ కకపాల జోలిసంచి
కలికికాటుకగీర్బొట్టు పలుగుపేరు, జాతిగాఁ దాల్చి నెఱిమిండజంగ మగుచు. 40

వ. భిక్షాటనంబునకుం జొచ్చె నప్పు డవ్వేళవాటంబునందు. 41

శా. ప్రాలేయాచలకన్యకాధిపతికిం బ్రమ్లోచమోచాఫల
స్థూలాపూపఘృతాన్వితంబుగఁ గడుందోరంబు బిచ్చంబుఁ గొం
గేలం బెట్టె నఖాంకురద్యుతులతోఁ గీల్కొంచు మాణిక్యము
ద్రాలంకారమయూఖకందళదళవ్యాపార మేపారఁగన్. 42

తే. రంభ రంభామ్రఫలసమగ్రంబుగాఁగ, నమృతద్రివ్యాన్నభిక్ష కామారి కొసఁగె
రావుఁజన్నులనడుమ రారాజుపట్టి, పట్టి యెత్తిననఖరేఖ బయలుపడఁగ. 43

సీ. కనకనూపురరణత్కారనిక్వాణంబు, రవలి మెట్టెలతో రాయిడింప
రవయుంగరంబులరత్నాలదీప్తులు, వాఁడిగోళ్ళపై జీబువాఱఁ
గుదురునిండినమించుగుబ్బచన్నులమీఁద, ముత్యాలహారంబు మురువు సూపఁ
గంపించుబంగారుఁగమ్మలక్రొమ్మించు, నిద్దంపుఁజెక్కుల నీడ సూప

తే. నెదురుగా నల్ల నేతెంచి హేమపాత్ర, నాజ్యమధుశర్కరాఫలాద్యన్వితముగ
మదనవైరికి నర్పించె మంజుఘోష, యమృతదివ్యాన్నపాయసాహారభిక్ష. 44

శా. అక్షయ్యంబుగ దివ్యమాధుకరభిక్షాన్నంబు వడ్డించెఁ దా
గోక్షీరంబులతోడ శర్కరలతోఁ గ్రొన్నేతితోఁ దేనెతో
ద్రాక్షాదాడిమచూతపాకములతో దాక్షాయణీభర్తకున్
జక్షూరాగ మెలర్పఁగా హరిణి విశ్వాసంబుతో ముంగిటన్. 45

ఉ. అల్లనఁ జేర వచ్చి ధవళాన్నముఁ గమ్మని యాలనేతితో
బెల్లముతోడ నాల్కడపుఁబేసముతోడను నిమ్మపండ్లతో
వల్లభుమూర్తి నెచ్చెలికి వారణవైరికి మంచుఁగొండరా
యల్లునికిం బినాకికిఁ బ్రియంబున నూర్వశి పెట్టె భిక్షమున్. 46

ఉ. పెట్టెఁ దిలోత్తమాప్సరస భిక్ష ప్రియంబున భూతభర్తకున్
గట్టెఁ బసిండి శర్కరలఖండముతోడ ఘృతంబుతోడఁ గ్రొం
బట్టుఁబసిండి సిబ్బెలపుఁబయ్యెదకొం గొకకొంత జాఱి చ
న్గట్టు లలాటలోచనుని కన్నులు మూఁటికి విందు సేయఁగన్. 47

తే. సహజసౌజన్య సహజన్య శంకరునకుఁ, బొసఁగ వడ్డించెఁ దత్కాలపుణ్యభిక్ష
సారదోర్మూలకూలంకషంబులైన, వీఁగుఁబాలిండ్లు పయ్యెద వీడుకొలుప. 48

క. విశ్వచతుర్దశభువనా, ధీశ్వరునకు భక్తియుక్తి నెసకంబెసఁగన్
విశ్వాచి యనెడునచ్చర, శశ్వన్మధురాన్నభిక్ష సమ్మతిఁ బెట్టెన్. 49

తే. కనకనూపురమేఖలాకలకలంబు, రత్నకంకణరవముతో రాయిడింప
సభవునకుఁ బెట్టె మధురదివ్యాన్నభిక్ష, చిత్తభవకీర్తిశశిరేఖ చిత్రరేఖ. 50

వ. మఱియుం దక్కలేఖాంగనలు భుజంగభూషణునకు నపాంగరంగస్థలలాస్యలంప
టంబులగు కటాక్షవీక్షణంబులతోడఁ గూడ భిక్షాహారంబులు సమర్పించిరి కంద
ర్పసూదనుండునుం బ్రతిమందిరంబునం జందనకుసుమధూపదీపా ద్యుపచారంబులు
గ్రహించుచు నవ్వేశవాటంబున భిక్షాటనక్రీడ సలిపి యంతం దనివిసనక కనక
గర్భకపాలపాత్రం బర్ధపూర్ణంబై కరపల్లవంబున నుల్లసిల్ల నల్ల నల్లన యోగపా
దుకాయుగళంబు గల్లుగల్లున మ్రోఁగ మునిజనాశ్రమంబుఁ బ్రవేశించి మునిమందిర
ములమోసలల నిలిచి 'భవతి భిక్షాం దేహి' యటంచు వారివాహగర్జాగంభీరస్వరం
బునఁ బలుకుచుఁ గులాంగనాజనంబు నపాంగదృక్తరంగంబులం జిఱునగవు లిసిఱిం
తలువాఱఁ గనుంగొనుచు సంయమివధూపాతివ్రత్యభంగంబు తనకుం బరమప్ర
యోజనంబుగా గర్భక్తిసందర్భంబుల నిజాభిలాషంబుఁ దేటపఱచుచుఁ బర్యటిం
పం దొడంగిన. 51

మ. దరహాసంబుల భ్రూలతానటనచేతన్ విభ్రమప్రౌఢిమన్
బరిహాసోక్తుల భావగర్భరససంపత్తిస్ఫుటాలోకన
స్ఫురణాభంగుల మౌనికాంతలమనంబుల్చూఱలాడెన్ మహే
శ్వరుఁ డుద్దామవిలాసదారువనికావాటప్రదేశంబులన్. 52

సీ. సుబలమార్కండేయశునకమాంజాయన, మాండవ్యగోత్రసంభవులయిండ్ల
బకదాల్భ్యరైభ్యకభల్లకిజతుకర్ణ, కణ్వవత్సాన్వయాగ్రణులయిండ్ల
ఘటజానుకాత్రేయకటకలాపసుమిత్ర, హరివక్త్రముని వంశధరులయిండ్ల
వాయుభక్షకభార్గవవ్యాసజైమిని, శుకకపిలకులప్రసూతులిండ్లఁ
తే. బుణ్యగృహిణులఁ బతిభక్తిపూర్ణమతుల, భాగ్యసంపన్నలను బుత్రపౌత్రవతుల
సతుల ముత్తైదువుల నిర్విశంకవృత్తి, రజనికరఖండమౌళి విరాళి గొలిపె. 53

వ. ఇట్లు ప్రతిగృహంబున భిక్షాటనంబు సేయుచు మహోక్షలాంఛనుఁడు వాంఛానుకూలప్రకారంబునం జోరరతవ్యాపారపారాయణుండై మగలకన్ను మొఱంగి సంధ్యాసమయంబుల ననుష్ఠానార్థంబు పురుషులు సమిత్కుశఫలాహరణార్థం బెందేనిం జనినయెడరు వేచి శపథశతక్షతోష్ఠంబును నిరుద్ధనిశ్వాసోత్సాహంబును నివారితోల్లాసంబును నిమేషమాత్రసాధ్యంబును నిబిరీసభయకంపంబు నైనసంభోగంబు లభిలషించు నారంభోరువులమనంబు లెఱిఁగి సంకేతస్థానకేళికలను నికుంజక్రోడసంవేశక్రీడలను వాతదూతీపరామర్శంబులను భ్రూలతాదేశంబులను నపాంగరంగస్థలాస్యలంపటకటాక్షవీక్షావిక్షేపంబులను మందహాసకందళితపరిస్పందంబులఁ గందర్పపరబ్రహ్మానందం బనుభవింపం జేసి మిసిమింతుండునుంగాక దేవదారుకాంతారమధ్యంబున. 54

సీ. మువ్వన్నెపులితోలు మొలదిండుగాఁ గట్టి, కర్కోటకాహి బాగగ బిగించి
చిలువపోఁగులను వ్రేల్చెవులఁ గీలనచేసి, వలరాచనీరు మైఁ గలయ నలఁది
చిన్నారిపొన్నారిశిశిరాంశుఁ దలఁదాల్చి, కొనగోటిజత లేడికొదమఁ బూని
పచ్చియేనికతోలుపచ్చడంబు ధరించి, గిలుకుమువ్వలకోలఁ గేలఁ బట్టి
తే. పసిఁడిజలపోసనముతోడ నైసకమెసఁగు, బిసరుహాసనుపుఱియకప్పెర ధరించి
పెద్దనడివీధి నిలుచుండి భిక్ష యడుగు, నాశ్రమంబునయందు ఖట్వాంగపాణి. 55

వ. ఇవ్విధంబున మన్మథమథనుండు మదనోన్మాదంబునం గన్నుగానక మునికళత్రంబుల పాతివ్రత్యంబులు గాలిపుచ్చుచు విచ్చలవిడిఁ జరియింపం బూనిన నిలింపమౌనివ్రాతంబు వారివారికి నెఱింగి గుజగుజవోవుచు వంచనంబు ప్రకాశింపంజాలక లోలోన యడంచుకొని యుండుచుండ నప్పాటం బ్రతిభవనంబునఁ జాటిల్లుచీఁకటితప్పు

కప్పిపుచ్చ నెరపుపడకుండునట్లుగాఁ బ్రకాశించినఁ గట్టాయితంబై యందఱు నా
జెనజెట్టివేల్పు నేనిం బట్టుకొనువారై చుట్టుముట్టిన. 56

క. ముసిముసినవ్వులు నవ్వుచు, మిసిమింతుఁడు గాక యొక్కమిఱుత నిలిచి య
క్కుసుమశరహరుఁడు తపసులు, కసమసఁ దనుఁబట్టుకొనఁగఁ గడగినఁ బెలుచన్.

* * * * * * *
* * * * * * *
* * * * * * *
* * * * * * *

## ఆశ్వాసాంతము.

శా. శ్రీమద్దక్షిణకాశికాపురమహాశ్రీకాళహస్తీశ్వర
ప్రేమాత్మోద్భవకాలభైరవకృపాశ్రీవర్ధితైశ్వర్య! యు
ద్దామప్రాభవ! దానవైభవకళాధారేయ! హేమాచల
స్థేమా! వీరకుమారగిర్యధిపలక్ష్మీభోగభాగోచితా! 58

క. కావేరీవల్లభ! సం, భావితబుధలోక; సమరఫల్గున! ధరణీ
దేవార్చనాపరాయణ, కోవిద! తిరుకచ్చినంబికులజలధిశశీ!. 59

మాలిని. మృగమదఘనసారోన్మీలనాసంప్రయోగ
ప్రగుణితహిమపాతప్రౌఢకేళీవిహారా!
యగురుఘుసృణపంకవ్యాప్తిగంధాంబుగంధ
స్థగితదిగవకాశా! దానవిద్యానిధీశా! 60

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథ
నామధేయప్రణీతం బయినహరవిలాసంబను మహాప్రబంధంబునందుఁ

పంచమాశ్వాసము.



# షష్ఠాశ్వాసము.



శ్రీవటుకనాథభైరవ
దేవశ్రీపాదపద్మదృఢతరభక్తీ!
దేవబ్రాహ్మణసేవక
దేవప్రభుతనయ! యవచిదేవయతిప్పా! 1

వ. ఆకర్ణింపుము. 2

ఉ. హేమనగంబుమీఁద దివిజేంద్రులు గొల్వ మహావిశుద్ధము
క్తామణిరత్నసంఘటితకాంచనగండశిలాతలంబునన్
హైమవతీసహాయుఁ డయి యర్ధశశాంకధరుండు దేవతా
గ్రామణి నీలకంఠుఁడు సుఖంబునఁ దాఁ గొలువుండె నర్మిలిన్. 3

వ. అప్పుడు పార్వతీదేవి మహాదేవునియింగితం బెఱింగి యిట్లనియె. 4

తే. అభవ! నీకంఠమూలంబునందుఁ దెలిసి, కాన నయ్యెడు నిది యేమి కప్పు సెప్పు
మఖిలలోకవిలోచనాహ్లాదకలన, కందమై యంద మయ్యె శృంగారరేఖ. 5

తే. అనలిమ్ము మహాదేవ! యభవ! నీదు, కంఠమూలము నలుపైనకారణంబు
నన్ను మన్నించి యీకారణంబు నాకు, నానతీఁ దగు నీవు లోకాభివంద్య. 6

వ. అనిన విని శంభుండు శాంభవి కిట్లనియె. 7

మ. మును జంభాసురబాహువిక్రమకళాముద్రావిభాభాసురున్
ఘనదంభోళిసశాతహేతినిహతిన్ ఖండించి యాఖండలుం
డనుమోదంబున దేవతల్ గొలువఁగా నైరావణారూఢుఁడై
ఘనమార్గంబున వచ్చె నాకమునకున్ గర్వం బఖర్వంబుగన్. 8

క. ఆవేళను గంధర్వులు, కైవారపదానుసారకమనీయముగాఁ
బ్రావేశికధ్రువాగా, నావళులం బఠియించి రంచితలీలన్. 9

ఉ. క్రచ్చఁ బారిజాతంబులిరాపనదేవతె జంభవైరిపై
మచ్చికఁ గూర్పఁగా నవసుమప్రకరంబుల వేల్పుఁజేఁటిలో
విచ్చిన పైడితామరల వెంబడి వచ్చిన కమ్మగాడ్పులన్
మెచ్చులరీతిఁ గోకిలసమీరణ దీవన లిచ్చె నొప్పుగన్. 10

క. మందాకినీతరంగము, లాందోళము నందఁ జేయుచు పల్లవ సం
క్రందనునిమీఁదఁ బొలసెను, మందారలతావనాంతమందానిలముల్. 11
తే. దేవతాభర్త యమరావతీపురంబుఁ, జేరఁ జనుదెంచె వేల్పులు చేరి కొలువ
భ్రాజదైరావణానేకపప్రచార, తరళమాణిక్యకుండలాభరణుఁ డగుచు. 12
వ. అయ్యవసరంబున. 13
శా. గీర్వాణాధిపుచెంతకు న్నిలిచె నక్షీణప్రభావాధికాం
తర్వాణిస్తుతవాగ్విలాసుఁడు కృతద్వంద్వవ్యుదాసుండు చి
న్నిర్వాహస్థిరయోగవైభవకథానిత్యోదయోల్లాసుఁ డ
ద్దూర్వాసుండు ప్రసూనమాల్యరుచిమద్దోఃపద్మవిన్యాసుఁ డై. 14
తే. తనకుఁ బ్రమ్లోచ యను దేవతాపురంధ్రి, పావడముఁ జేసె నెద్దాని భయముతోడ
నట్టితన పారిజాతమాల్యంబు హరికి, దర్శనం బిచ్చె దీవించి తాపసుండు. 15
వ. ఇట్లు దూర్వాసుం డాశీర్వాదపూర్వకంబుగా నొసంగినకుమార పారిజాతమాల్యం
బహల్యాజారుం డగుటను నాసీరుండు దుర్వారవిజయగర్వాటోపంబునం గన్నుగానక
పట్టితాలంకారతాటంకితలలాటం బగునైరావణకరటికుంభపీఠంబుపై నలవోక
యుంబోలె నైచె వైచిన నమ్మదాంధగంధసింధురంబు వసుంధరాభరణశుండం బగు
తుండం బెత్తి నున్నని యప్పువ్వుదండఁ గ్రమ్మఁ గ్రమ్మజెంచి విసరి కేసరంబులు వీసర
వోవ మకరందంబు చిందఁ బొరలు విఱుగం బుప్పొడి సకలం గపోలభిత్తిభాగం
బు మొత్తి యున్మత్తమధుపంబుల రేచి యుప్పరంబునం ద్రిప్పి చెందిరంబు ధూళిఁ
దూలించి యందంద కొంతతడవు వినోదించె నప్పువుదండ వాస్తోష్పతి పట్టినయేనుం
గువలన నిట్టు నట్టునం బడి కువిటుచేతం బడినపూఁబోఁడిపోలిక దెబ్బలివాతం
బడిన హరిణిచందంబునఁ బ్రమత్తునికైవస మగురాజ్యలక్ష్మివిధంబున విడివడియు
డస్సియుఁ గ్రుస్సియు నొగిలియుఁ బగిలియు దీనదశను వచ్చినం గనుంగొని. 16
మ. వికటభ్రూకుటిఫాలభాగుఁడును బ్రస్వేదాంబుపూర్ణాఖిలాం
గకుఁడుం బాటలగండమండలుఁడు నై కల్పాంతసంహారరు
ద్రకఠోరాకృతి దుర్నిరీక్ష్యుఁ డగుచుం దట్టించి దూర్వాసుఁ డు
గ్రకటాక్షంబున నింద్రుఁ జూచి పలికెం గాఢాగ్రహవ్యగ్రతన్. 17
క. ఓరి మదాంధ! యహల్యా, జార! త్రిలోకాధిరాజ్యజాత మగునహం
కారంబా యిది మత్తా, జీరికిఁ గైకొనక యిట్లుసేయుట యెల్లన్. 18
తే. ఏను దీవించి చేయెత్తి యిచ్చినట్టి, పుష్పమాలికానాదరలఁ బూనవైతి
హస్తిచేతికి నిచ్చితి వంతఁబోక, దండనారంబె యిప్పువ్వుదండ నీకు. 19
క. క్రోధం బితరులకుఁ దపో, బాధక మగుఁ గాని నాతపంబున కది యు

ద్భోధకమ సలిల మగ్నికి, బాధకమై వైద్యుతాగ్నిఁ బ్రభవించుగతిన్. 20
క. నీకనులకు నిది మాల్యం, బోకుధరవిరోధి! యింతనుండియు నిట నీ
నాకం బఖిలంబున ని, శ్శ్రీకం బగుఁ గాక నీవిజృంభణ మణఁగన్. 21
ఉ. నన్నుఁ దిరస్కరించితి మనంబున నించుక ప్రీతి లేక వే
గన్నులఁ గాన వైతి మదగర్వవికారదురాగ్రహైకసం
పన్ను నిరాజ్యలక్ష్మికి నపాయము గల్గక యుండు నెట్లు నీ
యన్నియు వస్తుజాతములు నంబుధిలోఁ బడుఁ గాత లక్ష్మితోన్. 22
క. ఎచ్చోట నుండు నిందిర, యచ్చోటనె యుండు సత్పదార్థంబులు నీ
యుచ్చైశ్శ్రవ మైరావణ, మచ్చరలమరద్రుమంబు లంభోధిఁ బడున్. 23
తే. అమృతకుంభంబు పడుఁగాక యబ్ధియందుఁ, గామధేనువు పడుఁగాక కంధియందుఁ
దారకాధీశ్వరుండుఁ జింతామణియును, గూడ దుగ్ధాంబునిధిలోనఁ గూలుఁగాత. 24
వ. అని పల్కి దూర్వాసుండు చూడంజూడ నంతర్ధానంబు సేసిన. 25
క. యతిపతిశాపాక్షరములు, శతమఖున కసహ్యహృదయశల్యము లయ్యెన్
మతిఁ దలఁపఁ బూజ్యపూజా, వ్యతిక్రమము సర్వకార్యహర మగుఁ గాదే. 26
తే. మానిశాపాగ్నిదందహ్యమానుఁ డగుచు, విన్ననైన మొగంబుతో వీడు సొచ్చెఁ
బాకశాసనుఁ డఖిలదిక్పాలకులును, దైన్యవైవర్ణ్యవంతులై తన్నుఁ గొలువ. 27
వ. అంతం గొంతకాలంబునకు.
సీ. రంభాదు లగునప్సరస్సరోజాక్షులు, పదునాల్గుజాతులు పడిరి వార్ధి 28
సంతానతరుపారిజాతాదికుజములు, మున్నీటినీటిలో మునిఁగిపోయె
నైరావణమ్ముఁ జింతారత్నముం గూలె, నుచ్చైశ్శ్రవంబుతో నుదధిలోనఁ
గామదుగ్ధేనువుఁ గాదంబరియుఁ దాను, నమృతకుంభంబుతో నబ్ధిఁ బడియె
తే. నిమ్మహావస్తువులఁ గూడి యిందురేఖ, మున్న గా దుగ్ధమయమహాంభోధిఁ జొచ్చె
బ్రహ్మమునిఘోరశాపప్రభావయుక్తిఁ, బ్రథమదిక్పాలుతై త్రిలోక్యభవ్యలక్ష్మి. 29
తే. దివ్యమణి లేక యప్సరస్త్రీలు లేక, యమృతకుంభాదు లగుపదార్థములు లేక
యుక్కువడియుండె బహుకాల మొప్పు దఱిగి, విగతలక్ష్మీవిలాసుఁడై వేల్పుఱేఁడు.
చ. అమృతముఁ గల్పవృక్షనివహంబును లేనిను వారసాశన
త్వమున నశోకవల్కపరిధానతయుం గలవేల్పు పెద్ద తా
నముచినిషూదనాదులు మనంబున నొందిరి ఖేదమోదదుః
ఖము గుడువంగ నోగిరము గట్టఁగఁ బుట్టముఁ బుట్టకుండుటన్. 31
వ. ఇవ్విధంబున బృందారకు లిందిరావ్యపాయంబున నపారదారిద్ర్యాంధకారమగ్నులై
నగ్నాటులుం బోలి భయంపడి లేటమొగంబు వడి హాటకగర్భుపాలికిం బురందరుండు

నుందఱగాఁ జని మునిశాపయుక్తి మూడులోకంబులరాచసిరి యబ్ధిలో మునింగిన భంగి తేటతెల్లంబుగఁ దెలియంబఱచిన నానలినాసనుండు వెన్నునిం గూర్చుకొని మాసమీపమ్మునకు వచ్చి మమ్మిట్లు సన్నుతించె. 32

క. జయ పార్వతీమనోహర! జయ పరమానంద! జయ నిశాకరమౌళీ!
జయ భూమిసలిలపావక, వియదనలార్కేందుహోతృవిలసితమూర్తీ! 33

క. త్రిభువనభువనారంభా, రభటీసంరంభమూలరత్నస్తంభా!
యభినవహిమకరరేఖా, శుభికాలంకారధామశోభితమకుటా!. 34

క. దివసావసానసంధ్యా, నవపరమానందనందినాందీనాథ
వ్యవహారఘుంక్రియావధి, వివిధమహాతాండవైకవిద్యాభిరతా!. 35

క. తరుణహిమకిరణరేఖా,భరణా! సురనికరమకుటభాసురరత్న
స్ఫురణాపరిచయరంజిత,చరణా! నిరుపాధికాభిసంప్రతికరుణా. 36

తే. అజర! యవ్యయ!యనపాయ! యప్రమేయ!,యాద్య!యనవద్య!వేదవిద్యాభివంద్య!
నిర్మలాకార! నిర్ద్వంద్వ! నిరుపమాన!, నిత్య! నిజభక్తవైకుంఠ! నీలకంఠ.! 37

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతింప ననుకంపాపరాధీనుండ నగునే నిట్లంటి. 38

తే. అబ్ధి మథియింపవలయు నీయవసరమున, నమృతలక్ష్మీప్రధానమహాపదార్థ
సముదయంబులు లేకున్న జగము లెల్ల, విన్నఁబోయిన వతిదీనవృత్తి నొందె. 39

సీ. ఆరసాతలమగ్న మయ్యు మునుంగని, మందరాద్రీంద్రంబు మంథయప్తి
సర్వసర్వంసహాసంభృతిప్రవణుండు, దందశూకస్వామి తరువుఁద్రాడు
చరమాంగస్థితికాస్థాపితశేషుండు, కిటవకచ్ఛపరాజు క్రిందిమట్టు
నింద్రాదిసురలు బలీంద్రాదిదనుజులు, దర్పదుర్వారులై త్రచ్చువార

తే. లేను బ్రహ్మయు హరియును నింత నంత, నుందువారము కార్యప్రయోగరతిని
నీవిధంబున దుగ్ధాబ్ధి యేచి తరువ, వివిధసద్వస్తులుం బ్రభవింపఁ గలవు. 40

వ. ఇట్టిమహాప్రారంభంబునకుం దగినసాధనసామగ్రి యిది. శేషుండును గమతపతియును నశేషభువనభారంబునకుం దగినవారి నియోగించి వచ్చునది. యచ్యుతుండు సురాసురులం గూర్చుకొని మందరాచలంబు పెటికితెచ్చునది. యేనును బితామహుండును మున్నాడి పాలమున్నీటిదరికిం జేరి యుండువారము. ఇదియ నిశ్చయం బని యే నంతర్ధానంబుఁ జేసితి. జలజాసనుండును మదాదేశంబున దుగ్ధాబ్ధితీరంబుఁ జేరె. జనార్దనుండును దేవదానవసేనాసమేతుండై దిక్పాలురుఁ గూడ రాఁ బశ్చిమదిశాముఖుండై చనువాఁడు ముందర. 41

శా. కాంచె న్మందరశైలముఁ మృదుతటీగండోపలశ్రేణికా
చంచన్నిర్ఝరవేణికాఘుమఘుమస్ఫాయద్ధిశాగోళముఁ

బంచాస్యస్ఫుటకంఠనాళనినదప్రధ్వస్తశుండాలముక్
సంచారాలసకిన్నరీకశతలతాసంభగ్నహింతాలమున్. 42

వ. చను దెంచి యప్పాంచజన్యధరుండు జంభారిప్రముఖు లగు దివిజవరుల నెడ గలుగం దొలంగ నియమించి. 43

సీ. కటిమండలంబునం గనకంపుసుమం జేల, నృపముగా బిగియించి దిండుగట్టి
కట్టాయితం బైనకంఠహుంకారంబు, గావించె దిక్కులు గ్రక్కదలఁగ
సమధికావష్టంభసంరంభజృంభణ, సమహార్చి నిజభుజాస్తంభమునకుం
బాదాభిఘట్టనం బార్శ్వదేశంబుల, నదలించి ధాత్రి గ్రక్కదలఁ జేసి

తే. పట్టెం గదలించె ననియార్చెం బాత్రగర్చె, నెత్తె వక్షస్థ్సలంబున నెటియ నొత్తెం
దోయజాక్షుండు లోకైకదుర్ధరుండు, దాల్చె నవలీల నిట్లు మందరనగంబు. 44

సీ. అంగదాభరణంబులందుం గీలించిన, వజ్రాలకీలన వదలకుండ
వక్షస్థ్సలంబున వైచిననవకంపుం, దులసిదండక్షు వాడు దోంపకుండం
గడు నొప్పం దీర్చినకస్తూరితిలకంబు, చెమటబిందులచేతం జెదరకుండ
నెట్టెంబు సుట్టిన నెమ్మి పించముదండ, కొనరేక యొక్కింత గుదియకుండ

తే. శ్రవణకల్హారముకుళంబు జాఱకుండ, విరులక్కీల్కొప్పు వదలి కై పెక్కకుండ
నెత్తె శృంగారకౌతుకం బెత్తినట్లు, కైటభారాతి మందరక్ష్మాధరంబు. 45

శా. గోలాంగూలకులంబు లాకులపడెన్ ఘోషించె శార్దూలముల్
జాలిం బొందె లులాయముల్ సుడిగొనెన్ సారంగముల్ విచ్చె లేం
గోలంబుల్ బెదరెం జమూరుగణ మాక్రోశించెం బంచాస్యముల్
తాలాంకావరజుండు మందరమహాధాత్రీధరం బెత్తినన్. 46

తే. ఏడు పాతాళములును గగ్గోడువడియెం, బెల్లగించి మహీధ్రంబు పెటికినప్పు
డిందిరాభర్త గిరిమీంది కెత్తినపుడు, గ్రక్కదల సాగె బ్రహ్మాండకర్పరంబు. 47

తే. ధాత్రి నాండు వరాహావతారవేళ, నేకదంష్ట్రాగ్రమున ధరియించినట్టి
తోయజాక్షుండు బాహాచతుష్టయమున, మాటమాత్రనె మోయండె మందరాద్రి.

తే. మందరాద్రిని మోయించి మాధవుండు, పట్టి తెప్పించె నిర్జరప్రతతిచేత
నసురయూథంబుచేత దుగ్ధాబ్ధిదరికి, నబ్జగర్భుండు నేనును నభినుతింప. 49

వ. అనంతరంబ నేనును హరిహిరణ్యగర్భులుం గార్యభారధురంధరులమై ప్రవర్తింపం బురందరాదిసురలు జలంధరాదిరాక్షసులును సముద్రమథనంబునకుం బ్రారంభించిరి.

తే. అఖిలకార్యసమారంభణాదులందుం, బూజనీయుండు గావున బుద్ధిం దలంచి
విఘ్ననాయకు నంభోధివేలమీంద, సురలు నసురలుం గొలిచిరి పరమభక్తి. 51

శా. క్షీరాంభోనిధి సైకతస్థలమున న్సింహాసనారూఢుఁగా
హేరంబు న్వరదుండను న్నిలిపి ప్రత్యేకంబ దేవాసురుల్
గారామారఁగ నాచుంచి రభిషేకం బుల్లసద్గంధక
స్తూరీసౌరభవాసితంబుల నదీతోయంబులం దోఁగఁగన్. 52

క. అభిషేకానంతరమున, నిభరాజాస్యునకుఁ గట్ట నిచ్చిరి యదితి
ప్రభవులును దితితనూజులు, నభినవదివ్యాంబరములు నాభరణములున్. 53

తే. కుంకుమాగురుమృగనాభిపంకములను, గంధకర్పూరనీహారకర్దమముల
నలఁది రమరాసురులు భక్తి యతిశయిల్ల, భవునిపట్టికిఁ బసిఁడికుంభములఁ బట్టి.

సీ. ఉండ్రాలు నూఁబిండి పుండ్రేక్షులుం దేనె, యనఁటిపండ్లుం బూరియలు ఘృతంబుఁ
బెసరుఁబప్పును బాలుఁ బెరుఁ గోగిరంబులుఁ, బాయసాన్నంబులుఁ బానకములు
నాళికేరంపుబొండాలు మీఁగడయును, నవదధిపిండఖండా ల్గుడుములు
లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు, ఖండంబు చలిమిడి మండపప్పు

తే. లాదిగా భక్ష్యచోష్యలేహ్యాదు లైన, బహుపదార్థంబు లర్పించి ప్రణతు లైరి
వేలుపులు రాక్షసులును నావిఘ్నపతికి, దుగ్ధపాథోధిమథనోద్యోగవేళ. 55

వ. ఇట్లు షోడశోపచారంబులం బూజించి దేవాసురులు విఘ్ననాయకు నిట్లని స్తుతి
యించిరి. 56

దండకము. జయజయ జగదేకరక్షామణీ! దేవచూడామణిశ్రేణిశోణప్రభాజాలసుస్మేర
పాదారవిందా! ముకుందప్రియా! యిందుధారీ! కటస్యందిదానాంబుధారాఘనీఘోర
ణీగావాకాతూహలాయత్తమత్తద్విరేఫాంగనాగానసంగీతరంగీకృతస్వాంత! దంతా
వళాస్యా! నమస్యా! త్రిలోకైకవశ్యా! యపశ్యాయశైలాత్మజాధర్మసంతాన!
సంతానకల్పద్రుపుష్పావతంసా! యసాగోరుసంసారమాయాంధకారాహృతిప్రక్రి
యా భాస్కరా! కోటిభాస్వత్స్విరాఘాటదేహప్రభాభాస్వరా! దేవ! హేరంబ!
లంబోదరా! యేకదంతా! మహాకాయ! సంతప్తకార్తస్వరాభా! విశాలాక్ష! మౌంజీ
ధరా! నాగయజ్ఞోపవీతా! సమస్వీతకృష్ణాజినా! యాఖువాహా! కుఠారాయుధా!
విఘ్నరాజా! గణాధ్యక్ష! కారుణ్యలీలాకటాక్షంబులన్ మమ్ము వీక్షించి రక్షింపుమీ
క్షీరవారాశి నీ మందరక్ష్మాధరస్వామి కవ్వంబుగా సీభుజంగాధినాథుండు నూత్రం
బుగాఁ గచ్ఛపాధీశుఁ డాధారపీఠంబుగా సర్వదివ్యౌషధీవల్లుల న్వైచి నానాపదా
ర్థంబుల న్వెన్నలం బంచుకోఁగోరి యున్నార మిక్కార్య మావిఘ్నముం బొందకుం
డంగ నెవ్విక్రియం జెంద కిష్టార్థసంసిద్ధులం గైకొనుం గాక నీ యాజ్ఞ సర్వేశ! సర్వాత్మ
కా! నిర్వికల్పా! నిరీహా! నిరాతంక! నిశ్శంక! యోంకారమూర్తీ! నమస్తే నమస్తే నమః.

క. అని నిర్జరులును దైత్యులు, వననిధిమథనాదియందు వారణవక్త్రుం
గొనియాడి తత్ప్రసన్నతఁ, గని రాగి సంతసము మీఱఁ గడఁక దలిర్పన్. 58

వ. కట్టాయితం బై సురాసురులు బిట్టేచి పాతాళగోళంబు క్రిందమట్టుగా నాదికమఠంబుఁ బెట్టి వాసుకిఁ దరిత్రాడుగాఁ జుట్టి తోఁకయు శిరంబును బట్టి మందరాచలమంథానంబున దుగ్ధసింధువు మథింపం దొడంగిరి. ఘుమఘుమధ్వానంబు దిక్కులం బిక్కటిల్లె. వారివాహవ్యూహంబులు కడ లవియఁ జదల నదిలకొనియె. డిండీరపిండఖండంబులు బ్రహ్మాండంబునం బ్రసరించె. నంభస్తరంగంబులు దిగిభకుంభంబుల నాస్ఫాలించె. నావర్తచక్రంబులయందు గ్రహతారకానక్షత్రంబులు తిరుగుడువడియె నప్పుడు రటత్తిమితిమింగిలంబులును లంబచ్ఛంబలంబును వళద్ధూళియు విరుత్కమఠంబు నుద్భ్రమద్భుజంగంబును నైగంగకుం బరిభవంబును గోదావరికి భేదంబును వేణ్ణకు విన్నఁబాటును గాళిందికి మాలిన్యంబును వేత్రవతికిఁ ద్రాసంబును విపాశకుం గ్లేశంబును శతద్రువున కుపద్రవంబును నాపాదించుచు బాడబానలంబునం దోకతోకనుడు కునీరునుం గలసి నఖంపచం బై సంవర్తసమయారంభంబునుంబోలె మర్యాద నతిక్రమించుచు గిరికటకపాషాణసంఘట్టనంబున నెగయుమిణుంగురులుంబోలె నంతర్మణిశలాకాశకలంబులు మీఁదికెగయ నంభోనిధానంబు మథ్యమానం బయ్యె మఱియును.

సీ. మూలాశ్మసంఘాతమూలరాపిడిని జేసి, కమఠంబు సుఖియించి కన్ను మోడ్చెఁ
కటకపాషాణసంఘట్టనంబున ప్రస్సెఁ, గుండలీంద్రుని వీఁపుకుప్పసంబు
సానూపలద్రోణిఝంఝురుల ఝాంకారంబు, దిఙ్మండలంబుల దీటుకొనియె
శిఖరకోటీశిలాశ్రేణిరారాపుల, గ్రహతారకములు చూర్ణంబు లయ్యెఁ

తే. ప్రబలబలగర్వదుర్వారబహుసుపర్వ, పూర్వగీర్వాణభుజదండభూరిసార
వితతమందరమంథానవిచలనముల, సలిలనిధి మారె సంరంభసంభ్రమమున. 60

వ. ఇట్లు తరువందరుప సముద్రమధ్యంబున. 61

ఉ. బుగబుగమందుగర్భజలపూరము ఘూర్ణిల బంతిగట్టి క్రొం
బొగలు తరంగసంఘములఁ బొడ్మఁగ సూక్ష్మ జగత్త్రయంబునుం
బొగులఁగఁ జేయనుద్దవిడిఁ బుట్టెను నల్లనిచిచ్చు మావిలేఁ
జిగురులచాయలం దెగడుజిహ్వలు గ్రోయుచు దుర్నిరీక్ష్యమై. 62

క. వాసుకివిషభరవిషని, శ్వాసంబుల ఘట్టనముల సమధికతరమై
యాసాగరమధ్యంబున, భాసురహాలహలంబు ప్రబలం బయ్యెన్. 63

చ. గిరళమహత్తరానలశిఖానివహంబులు దూటి పాటిసం
దరికొనియెం జగత్త్రయము తల్లడ మందిరి నెమ్మనంబులన్

సురగరుడోరగామరులు సృక్కఁ బితామహుఁ డంబుజాక్షుఁ డా
తురత వహించె దిక్పతులు తూలిరి ఘూర్ణిలె నేడువార్ధులున్. 64

వ. అప్పుడు సుస్థిరుండై విరూపాక్షుండు త్రైలోక్యరక్షాదక్షం బగుతనదక్షిణహస్తం బెత్తి యోడకుండుఁ డభయం బిచ్చితి నని యెంత యూఱడించిన నూఱడిలక నారాయణాదులు గత స్వేల్పులు పలాయమానపరాయణు లై వెనుక మరలియుం జూడకపోవం దొడంగిన. 65

శా. హుంకారం బొనరించి యప్రతిమకోపోద్రేకసంరంభని
శ్శంకాహంకృతిఁ జూచె నీశ్వరుఁడు హస్తంబుల్ భుజంగాధిపా
లంకారంబు నశేషలోకపరిపల్లావణ్యలక్ష్మీకలా
సంకోచావహదాహభీషణవిషజ్వాలాజిఘృక్షార్థమై. 66

క. స్తంభించి నిలిచె గరళము, శంభునిముందట యుగాంతజలధరముగతిన్
గంభీరహుంక్రియావ, ష్టంభసముజ్జృంభమాణసంరంభమునన్. 67

చ. జలధర మంతయై కరటిచందము గైకొని సూకరాకృతి
న్నిలిచి పికంబుతో దొరసి నీడుపడును బోలె నుండయై
కలశపయోధిసంభవముఖంబునఁ బుట్టినయమ్మహాహలా
హలము క్రమంబున న్నృపునిహస్తసరోరుహ మెక్కెఁ జుక్కగన్. 68

క. కటుక మగువిషము విషధర, కటకం బగుకేలఁ బూని కాతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు రస, ఘుటికయునుంబోలె మృడుఁడు గుటుకున మ్రింగెన్. 69

తే. కంఠికానీలరత్నంబుకరణి నొప్పె, లలితమృగనాభిపంకంబుచెలువు దాల్చెఁ
గాలకూటవిషంబు శ్రీకంఠమునకు, నాభరణ మయ్యె బ్రహ్మాదు లభినుతింప. 70

వ. అప్పు డప్పరమేశ్వరు నిట్లని స్తుతియించిరి. 71

సీ. జయ విరూపాక్ష! యీశ్వర! దివ్యలోచన!, జయ వజ్రహస్త! దిశానివాస!
జయ పినాకోల్లాస! శాశ్వత! నిత్య! య,నిత్య! నిత్యానిత్య! నిరుపమాన!
జయ చింత్య! జయరుద్ర! జయమహాదేవ! య,చింత్య! చింత్యాచింత్య! చిత్స్వరూప
జయ పాదభక్తార్తిసంహారకారణ!, జయ ముకుందప్రియ! జయ గిరీశ!
తే. దివసమాసార్ధమాసషడ్విశ్వరూప! కల్పయుగవత్సరాదికకాలభేద
రుండ! బహురూప! చండీశ! దండపాణి!, జయ నమస్తే నమస్తే ప్రసన్నమూర్తీ! 72

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతించి నీలకంఠుం డనునామధేయంబు శివునికిచ్చి రిది కాలకూటోత్పత్తిప్రకారంబు. 73

ఉ. హాలహలాగ్ని దాహభయ మస్తమితం బయినఁ గడంక మై
వేలుపులు న్నిశాచరులు వెండియుఁ గవ్వపుఁగొండ వార్ధిలోఁ

దేలిచి గుమ్ముగుమ్మనఁగఁ ద్రిప్పఁగఁ జొచ్చిరి దానవేశ్వరుల్
వారిసహాయుఁ గాఁ గొని యవక్రభుజాబలవిక్రమంబునన్. 74
క. తరిగొండఁ దరువఁదరువన్, శరనిధిమధ్యమున నొక్కజలజము పుట్టెన్
బరిమళపరంపరలచే, సురభీకృత మయ్యె జగము సురుచిరభంగిన్. 75
వ. అయ్యష్టదళపద్మమునందు. 76
సీ. ఇరుప్రక్కియలనుండి సురసింధురంబులు, పరిపూర్ణ హేమకుంభములు దాల్ప
నందంద నవనిధానాధిదేవతలును, సారథి బంగారువీచోపు లిడఁగ
జయజయధ్వనులతో సర్వదేవతలును, గేలుఁదమ్ములు మాళిఁ గీలుకొల్పఁ
బుష్పవర్షములకుఁ బ్రోది యై వినువీథి, దేవదుందుభినాద మావహిల్లఁ
తే. బ్రబలి మున్నీటినడునీటఁ బొండువిరిచె, కమలకాంచనకర్ణికాగ్రంబునందు
బ్రహ్మాదిక్పాలవందితపాదపద్మ, పద్మ యుదయించెఁ గన్నులపండు వగుచు. 77
తే. పవడములఁ బోలు శ్రీహస్తపల్లవముల, దనర శోభిల్లు హేమపద్మము ధరించి
కలిమిచూపులపూఁబోఁడి కలశజలధి, నర్థిఁ గొలువుండె రత్నసింహాసనమున. 78
క. జలరుహవాసిని పుట్టిన, కలితముహూర్తమున రెండుగడియలమాత్రం
జలిగుఱ్ఱకాఁడై నిగనిగ, కలువలచెలికాఁడు పుట్టెఁ గలశపయోధిన్. 79
వ. తదనంతరంబ. 80
క. అందంద యుద్భవించెను, సందరమున నిందిరానుసంజాతములై
మందారకల్పతరుహరి, చందనసంతానపారిజాతాదు లొగిన్. 81
ఉ. అంతఁ బయోనిధానమునయం దుదయించె సరోజవాసినీ
కాంతకుఁ దోడఁబుట్టు వనఁగాఁ గరపద్మమునం జలూకికా
సంతతియుక్త హరీతకియు సాధనసంగ్రహ మై తలిర్ప ధ
న్వంతరి యెట్టిరోగములవారికి నామయసౌఖ్యకారియై. 82
తే. ఆదివైద్యుఁ డతండు దుగ్ధాబ్ధిఁ బుట్టె, నమృతపూర్ణకుంభం బొకహస్తమునను
నంబుచరమును గరక యయును నొకటఁ, దాల్చి సాకార మైనకాంతమయుఁ డనఁగ.
వ. మఱియును. 84
క. అచ్చపువెన్నెలచాయల, మెచ్చనితనుదీప్తితోడ మేఘధ్వనిపెం
పచ్చుపడఁగ సకిలించుచు, నుచ్చైశ్శ్రవ ముదధినడుమ నుదయం బయ్యెన్. 85
తే. క్షీరవారాశిలో నపతారమయ్యెఁ, దార యనుకన్యకయు నతిధవళనయన
తారకారాజబింబావదాతవదన, తారహారాదిభూషణోత్కరముతోడ. 86
శా. అయ్యంభోనిధివారిగర్భమునయుం దైరావణం బుద్భవం
బయ్యెం గండతలంబులన్ దొరఁగుదానాంభఃప్రవాహంబు లెం

నౌమ్యుయ్యర్ బ్రభవించి తజ్జలధిన్ రుబ్బింప దిక్సంధుల
న్వ్యాప్యం బొందఁ గఠోరగర్జితమహానిర్ఘాతనిర్ఘోషముల్. 87

సీ. మధుకరంబులు పుట్టె మధుకరంబులు గావు, రమణీయ వేణీభరములు గాని
శశిబింబములు పుట్టె శశిబింబములు గావు, మహితవక్త్రేందుబింబములు గాని
మెఱుఁగుఁదీఁగలు పుట్టె మెఱుఁగుఁదీఁగలు గావు, లలితకోమలతనూలతలు గాని
చక్రవాకులు పుట్టెఁ జక్రవాకులు గావు, కఠినంబు లగుచన్నుఁగవలు గాని
తే. యనఁగ మందరకందరవ్యాప్తిచలిత, వార్ధికల్లోలవీచికావర్తతతుల
నుద్భవిల్లిరి రంభాతిలోత్తమాదు, లప్సరస్త్రీలు దేవవేశ్యాజనములు. 88

క. తరిఁగొండఁ దరువఁదరువం, దిరుగుడుపడు నుదధిలోనఁ దీవ్రముగా ది
ర్దిరఁ దిరుగుచుఁ దరఁగలవడిఁ, దరతరమ సుపర్వసురభి దరికిం జేరెన్. 89

ఉ. అంత న్విద్రుమవల్లికాకిసలయవ్యాప్తైకశంకావహా
త్యంతస్వచ్ఛరుచిచ్ఛటల్ జలధిపై నందంద వర్తింపఁగా
స్వాంతాకాశాంతరభూమిభాగమున విశ్వంబుం బ్రకాశింపఁగాఁ
జింతారత్నశలాక పుట్టెను మహాక్షీరాబ్ధిమధ్యంబునన్. 90

తే. తరువఁ దరువంగ వార్ధిమధ్యంబునందు, నాగవల్లీలతాప్రతానంబు పుట్టె
నమృతసంసర్గమునఁ గదా యాకు నెలలు, జగు నేఁడాకునకు లేని సరసవృత్తి. 91

క. శీతలపరిమళధారా, పూతపవిత్రాయమానపవమానంబై
యాతోయధిమధ్యంబున, శ్రీతులసీవనము పుట్టె శ్రీయంశమునన్. 92

తే. కనిగ దివ్యౌషధీలతావళులశక్తిఁ, బాలమున్నీటినీటిలోఁ బ్రథితలీల
విమలగారుడమాణిక్యవిభ్రమంబు, లభినవంబులు హరితదూర్వాంకురములు. 93

వ. ఇట్లు మహార్ణవజాతంబు లగుపదార్థంబులం గనుంగొని బ్రహ్మాదిదేవతలు హరునకు శశాంకుని హరికి లక్ష్మి నింద్రునకు నైరావణోచ్చైశ్శ్రవంబులను నిచ్చిరి. అప్సరసల నాకంబున నుండ నియమించిరి. కామధేనువును వరుణున కొప్పనంబు సేసిరి. కల్పతరుచింతామణుల నందనోద్యానంబునం బ్రతిష్ఠించిరి. దూర్వాంకురంబులు హేరంబున కవతంసంబుగా నొసంగిరి. నాగవల్లీదళంబులు భోగార్థంబుగా భూజనంబుల కిడిరి. శ్రీతులసీకావనంబును సకలతీర్థంబులకు సమాశ్రయంబుఁ గావించిరి. యనంతరంబ మందరంబును యథాస్థానంబునం బెట్టి వాసుకిం బాతాళంబున కనిచి కమఠపతిం గుస్తగించి నివాసంబులకుం బోవ నుద్యోగించి యున్నంత. 94

ఉ. అంధకకాలకేయమహిషాదులు దైత్యులు బాహుశౌర్యద
ర్పాంధులు గూడి మొక్కలము మొగ్గ మై వడిఁ దొమ్మి యొనర్చి వైద్యుని

ర్బంధము సేసి కైకొనిరి గ్రక్కునఁ దన్మహనీయదక్షిణ
స్కంధమునుమీఁద నున్నమణిప్రసుధారసహేమకుంభమున్. 95

తే. అమృతకుంభంబుఁ గైకొని యసురవరులు, వేఱ యొకచోట వేలంబు విడిసియుండి
రమరులకు నీక యప్పదార్థముఁ గడంగి, తార విభజించి భుజియించువారుఁ బోలె.

వ. అవ్విధం బెఱిఁగి హరవిరించులు విష్ణు రావించి గోత్రకలహంబు మాన్ప నిఖిలమా
యోపాయవిద్యావిదుండ వగు నీవ యెఱుంగుదు మాకు నిం కిక్కడ నుండం బని
లేదు పోయి వచ్చెద మని యామంత్రణంబు సేసి నిజస్థానంబుల కరిగినయనంతరంబ.

తే. కైటభారాతి యక్కార్యగతికిఁ దగిన, యనువు చింతించి యసురుల నవమతింప
సురల కమృతంబు నొప్పింప వెంవు దెలిసి, యరిగె నంతర్హితుం డయి యద్భుతముగ.

వ. ఇవ్విధంబున హరి యంతర్ధానంబు చేసినముహూర్తమాత్రంబున. 99

శా. ఆకాశంబుననుండి డిగ్గె నొక నీలాంభోజపత్రాక్షి ది
వ్యాకారంబును దివ్యమాల్యములు దివ్యాలంకృతు ల్దివ్యవ
స్త్రాకల్పంబులు దివ్యగంధములు నాహో పుట్టఁ జేయంగ నా
కాకశ్రేణికి దైత్యపఙ్క్తికిని విద్యుల్లేఖచందంబునన్. 100

క. బృందారకపథమున దిగి, యిందీవరపత్రనేత్ర యిరువంకలవా
రుం దమక తమక యిటు రా, యిం దనఁగా రెండువీళ్ళయెడమున విడిసెన్. 101

వ. నిలిచి హావభావవిలాసంబులన దేవాసురులం భ్రమియింపం జేయుచు స్కంధావార
మధ్యంబున. 102

సీ. పాకశాసనునకుఁ బరిహాసవచనంబుఁ, గాలకేయునకు శృంగారలీల
వైవస్వతునకు భ్రూవల్లరీనటనంబు, కరటిదానవునకుఁ గలికిచూపు
పాశపాణికిఁ గుచప్రాంతోరుదర్శనం, బంధకాసురునకు నలఁతినగవు
ధననాయకునకు నుత్కంఠావిశేషంబు, మహిషునకును నర్మమర్మకలన

తే. గంధవహునకు సిగ్గు జలంధరునకుఁ, గలికితనము బావకునకుఁ గౌను బళికె
వలపు నటియించుచును వారవార తనకుఁ, దాన వారికి వారికి నైనయట్లు. 103

తే. అందఱను బ్రమవెట్టుచు నవ్వధూటి, యెవ్వరికిఁ దాను బ్రమయక యెపెన యుండె
దానిపై వాలి చొక్కె నందఱమనములు, గంధఫలిమీఁద వాలుభృంగములపగిది.

తే. అసురులకు దేవతలకు నయ్యవసరమునఁ, బాలువోసుండె నప్పు డప్పద్మనయన
యుభయవాదులు గూడి యయ్యుత్పలాక్షి, పాదపంకజములకును బట్టువైరి. 105

వ. మఱియు విష్ణుమాయావిశేషంబున. 106

క. ఇది చెప్పినట్ల చేయుదు, మిది పంచినయట్ల నడతు మిది కళ్యాణా
భ్యుదయనిధానము మా కని, హృదయంబులఁ దలఁచు చుండి రిరువదెసవారల్. 107

తే. కనకసింహాసనము వెట్టి కాళ్లు గడిగి, పాదతీర్థంబు లొగిఁ ద్రావి ప్రణతి నేసి
కొలిచి కూర్చుండి రిరువంకఁ గొలమువారు, భువనమోహిని యైనయప్పువ్వుఁబోఁడి.

క. ఎవ్వనివంకఁ గనుఁగొను, నవ్వనితామణివిలోచనాంచలమున వాఁ
డవ్వేళన క్రీలించు, న్నవ్వం బగుకేలుదోయి మకుటాగ్రమునన్. 109

వ. వైరాగ్యానుబంధంబు లుడిగి యియ్యరువాగువారుం దమలోన నిట్లనిరి. 110

క. మన మెండొరు నమ్మక యెడ, నునిచినయీయమృత మింతయును దగ నింకే
నుని యొండుగాఁ దలఁపకీ, వనితామణి పంచిపెట్ట వలయుం జుండీ. 111

వ. అని యమృతకలశంబుఁ దెచ్చి యప్పయోజాక్షి చేతికిచ్చి ధర్మంబు పుణ్యంబు పాపంబు
నీయది యిరుదెఱంగులవారు నీకు నొక్కరూప యిప్పదార్థంబు మాకుంబంచి పెట్టుము.

తే. తప్ప కుండఁగఁ బక్షపాతంబు లేక, పంచిపెట్టెడువా రబ్బరంచుఁ గాక
యన్నదమ్ముల మై యుండి యకట మేము, నిన్ను వడ్డించు మందుమె యన్నుమిన్న.

తే. అనిన నేనేర్తునయ్య మీయంతవారు, కోరి కూర్చుండ నమృతంబుఁ గుడువఁబెట్టఁ
బంచి వడ్డింపనేర్చు టల్పంపుఁబనియె, తొల్లి యొకనాఁడెఱింగివత్రోవగాదు. 114

వ. ఆయిన మీవచనంబుల చెలిపంజాల నానేర్చినవిధంబున సుధారసంబు వడ్డించెద
మీరందఱుఁ గృతస్నానులై పయోధిపులినవేదికాస్థలంబున నిరుదెఱంగులవారును
రెండు బంతులుగాఁ గూర్చుండుఁ డని నియోగించిన. 115

తే. వార లట్లచేసి వరుసగాఁ గూర్చుండి, పసిఁడిపళ్లెరములు పన్నికొనఁగ
నల్లనల్ల వచ్చె నలసయానంబున, నమృతకుంభహస్త యగుచుఁ దరుణి. 116

మ. అరవిందాసన పట్టుఁబుట్టముచెఱంగాఁ దోళనం బొంద ని
ర్భరపీనస్తనభార మల్లఁ గదలన్ రత్నాలతాటంకము
ల్మెరయ న్నూపురమేఖలావలయముల్ మ్రోయంగ పాత్రంబుల
న్సురధేన్వాజ్యము త్రస్తరింపఁ దొడఁగె న్దూర్వాంకురాగ్రంబునన్. 117

ఉ. స్నానపవిత్రగాత్రులును చందనచర్చితబాహుమధ్యముల్
మానసమాధినిష్ఠులును మత్సరచిత్తులు నై మహాసమా
ధానముతోడ నుత్తరము దక్షిణము న్సముపాశ్రయించి య
ద్దానవులు న్సుపర్వులును దన్నుఁ బ్రియంబుగఁ జూచుచుండఁగన్. 118

తే. మధురగోక్షీరధారాసమాన మై, మంచియమృతంబు వెట్టె వైమానికులకు
మగువ మృగతృష్ణికాంభస్సమాన మైన, కల్లయమృతంబు వడ్డించెఁ గర్బురులకు. 119

వ. ఇవ్విధంబున నప్పరమాణుమధ్య తథ్యమిథ్యామృతాహారంబు లాసురాసురులకు వెట్టి
కామదుగ్ధేనువృతధారాభిషారంబు గావించి పంక్తిమధ్యంబున నిలిచి శంక ణరుణ

ఘృతశాల్యన్నంబులు తోరంబుగా నాపోశనంబు వోసి యారగింపుం డను ప్రొద్దువోయె
ననుచు నెలుంగెత్తి మత్తకోకిలకంఠకుహూపంచమస్వరంబునం బల్కెను. 120
తే. మొదలఁ దేనియలుట్టునంభోరుహాక్షి, ముద్దుబలుకులు శ్రుతిపుటంబుల భుజించి
పిదప భుజియింపఁ దొడఁగిరి త్రిదశవరులు, దైత్యులును దధ్యమిథ్యాసుధారసములు.
క. కిక్కురుమన కమృతంబుం, గ్రుక్కలు వెట్టుదురు సురలు కోణపముఖ్యుల్
తక్కరిసుధారసంబులు, గ్రుక్కలు వెట్టుదురు వారిఁ గూడియె తారున్. 122
తే. గ్రుక్కగ్రుక్కకుఁ గడుఁ దేజ మెక్కుచుండె
నమరులకు గ్రుక్కగ్రుక్కకు నగఁగుచుండె
దైత్యులకుఁ దేజ మట్టివిధంబు గాక
రాహుకేతువు లనియెడురాత్రిచరుల. 123
వ. తమయెదిరిపంక్తి నున్నచంద్రార్కులసాగడి న్నొలంగి కూర్చుండిన నాగ్రహరాజు
లిద్దఱుం దమలోన విట్లని విచారించిరి. 124
ఉ. వంచన వేల్పు లెంకి కిటువచ్చి యుపాంతమునందు ముందటం
గంచముఁ బెట్టుకొన్నయది కర్బురయుగ్మము మాఱువెట్ట నే
తెంచుచు నున్నవాఁడు మనదేవ విష్ణుఁడు వెంట కిరి సూ
చించుట మేలు సుధారసము చిప్పెఁడువోయకమున్న శౌరికిన్. 125
తే. అని విచారించి చెప్పనున్నంతలోనఁ, బోసె నిరుగంచములయందుఁ బుడిసెఁడంత
త్రావియును ద్రావకుండఁగ రాహుకేతు, లనుచుఁ జెప్పిరి సురవైరి కర్కవిధులు. 126
మ. అటు విన్నప్పుడ తత్సుధారసము కంఠాధఃప్రదేశంబు సా
చ్చుట లేకుండఁగ రాహుకేతువుల యత్యుద్రోత్తమాంగంబు లొ
క్కట ఖండించెను మాయపుంబడఁతియాకారంబు వీడ్కొక య
క్కటకాలంకృతహస్తచక్రమున శ్రీకాంతుం డపభ్రాంతుఁడై. 127
క. రాహువనుఁ గేతువకు హరి, బాహాచక్రమున నదరు పాటిల్లుటయుర్
హాహానినాదపటుకో, లాహలబహుళంబుగాఁ గలంగిరి దివిజుల్. 128
సీ. వేగ మాయావధూవేషంబు డిగఁద్రావి, కైకొనె నిజమూర్తి కైటభారి
హరి తమ్ము వంచించె సవివేళ గాదని, దైత్యులు చనిరి పాతాళమునకు
నమృతంబు భుజియించి యమృతకుంభముఁ గొంచు, జనిరి వేల్పులు నిజస్థానమునకు
బహువారములయందు బహువస్తువులు గాంచి, కలశపాథోరాశి కాను పుడిగె
తే. సుకన్యాపడి యున్కిమాని పెల్లుబ్బె నాక, మప్సరఃకామినీతురంగాదికముల
నచ్యుతుండును లచ్చి నటఁ బెండ్లియాడి యరిగె, నాగరిపు నెక్కి వైకుంఠనగరమునకు.
క. ఈవార్ధిమథనకథనం, బేవారు పఠించిరేని నెలమియును నాయు

శ్రీవృద్ధులఁ గాంతురు వి, ద్యావర్తియు యశము గల్గు నావాగలకున్. 130

శా. శంకాతంక విహీనవిక్రమకళాసాకల్యః జ్ఞాన ! సా
హంకారోరుపవేకవిక్రమ ! సురాహారాహితస్పర్ధిని
ష్పంకాశోజ్జ్వలకీర్తివిభ్రమ ! మహీసంకల్పకల్పద్రుమా !
లంకాశంకితశైలమధ్యవసుధాలంకార భవ్యక్రమా! 131

క. శరణాగతదీపంజర !, సరకుంజర ! దానకర్ణ ! నందితవిద్వ
ద్వరవర్ణ ! విమలచరిత, స్ఫురితా ! యనవరత శంభుపూజానిరతా !. 132

ఉపేంద్రవజ్రము. కులప్రదీపా ! యలఘుప్రతాపా !
విలాసశక్రా ! జితవీరచక్రా !
కళాజయంతా ! ఘనకాంతికాంతా !
నిరీశశంకా ! నిజనిష్కళంకా ! 133

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథ
నామధేయప్రణీతం బయిన హరవిలాసంబను మహాప్రబంధంబునందు
షష్ఠాశ్వాసము.



# సప్తమాశ్వాసము.





శ్రీకాళహస్తినాథ
ప్రాకారాంతఃప్రణీతపాతాళగుహా!
శ్రీకాళహస్తిభక్తసు
ధీకల్పితవిభవ! యవచిదేవయతిప్పా! 1

వ. ఆకర్ణింపుము.

ఉ. అర్జునుఁ డింద్రనీలగిరియందు రసాలతమాలతాలనీ 2
పార్జునలోధ్రతిందుకనవామలకీపనసామ్రపాటలీ
సర్జకురంటకాదిగురుచందనచందఃనింబకేతకీ
భూర్జకపిత్థపూగ్గముఖభూరుహపుణ్యతమాశ్రమంబునన్.

క. ద్యూతపరాభవమున నగు, చేతోదుఃఖమునఁ దపము చేయఁగఁ దొడఁగెన్ 3
భ్రాతలయనుమతి శత్రు, వ్రాతజయార్థంబు మది దివస్పతి గురిగాన్.

మ. ధనురస్త్రంబులు కేలఁ దాల్చి శరధిద్వంద్వంబు నేపార వీఁ 4
పున బంధించి కిరీటియై కవచియై పూనెం దపశ్చర్య య
ర్జునుఁ డత్యంతగరిష్ఠనిష్ఠ నమరేంద్రుం గూర్చి యయ్యింద్రకీ
లనగాగ్రంబునఁ బ్రత్యనీకవిజయశ్లాఘాభిలాషంబునన్.

క. వంచన మనంబులోన నొ, కించుకయును లేక యమ్మహేంద్రముమీఁదన్ 5
బంచానలమధ్యంబునఁ, బాంచాలీవల్లభుఁడు తపం బొనరించెన్

తే. గాండివముతోడ నొకయోగదండయష్టి, యస్త్రములతోడఁ గొన్నిదర్భాంకురములు 6
కలపములతోడఁ బుండరీకంబుతోలు, దాల్చి క్రీడి విరుద్ధపుఁదపము చేసె.

శా. శాకాహారుఁడు నిర్జితేంద్రియుఁడు పాషాణాగ్రతల్పుండునై 7
నాకేశప్రియనందనుండు సలిపె న్నానాప్రకారంబులన్
నాకుంజిత్తము దేహము న్సరియొకా నానాతపశ్చర్యలన్.
వ్యాకీర్ణోరగసింహభల్లుకలులాయాభీలశైలాటవిన్.

సీ. పతయాళునిర్ఝరాంభఃప్రవాహంబుల, నఘమర్షణస్నాన మాచరించుఁ 8
గొండగోఁగుంబూల గుఁడవర్ధనముల, నర్చించు శశిలాంఛనార్ధమౌళి

స్ఫటికాక్షమాలికాపాణి ప్రవాళుఁడై, జంభారిమంత్రంబు జపము చేయు
నొంటికాల బుజంబు నూర్ధ్వంబుగాఁ జాఁచి తడవుగా నిలుచుండి తప మొనర్చు
తే. శరభశార్దూలసింహాదిసత్త్వచయము, కేలి తనమీఁద బిట్టు లఘీంచునపుడు
కడిమిఁ జెండాడు భుజదండ గాండివోగ్ర, చండతరశాతనిర్ఘాతకాండనితతి. 9
తే. వీరరసగర్భితం బయ్యు విస్తరిల్లె, శాంతరస మెంతయును సవ్యసాచియందు
మలయశైలనితంబమండలమునందు, సర్పవేష్టితచందనక్ష్మాజమట్లు. 10
వ. ఇవ్విధంబునఁ గపికేతనుఁడు గాండివజ్యాఘాతరేఖాకిణకళంకాలంకారంబులగు కరం
బులు నీవారపాకంబునకును బాంచాలకన్యాకాంచకుంభకుంకుమప్రేక్షణీయం బైన
వక్షంబు రుద్రాక్షధారణంబునకును నంగారపర్ణగర్భనిర్భేదనచణహుంకారకారణం
బగు కంఠంబును హేంద్రదేవతామంత్రాక్షరధారణంబునకును ఖాండవదహనవేళావి
జృంభితావష్టంభసంరంభం బగు హృదయాంభోరుహంబు ప్రణవోపలంభమునకును
కుంభసంభవప్రదిష్టశాఖాశిఖరపక్షిలక్ష్యావలోకనజాగరూకం బగు వీక్షణంబులు నాసి
కాప్రదేశానుసంధానంబునకును యంత్రమత్స్యవిభేదనోపాయసందర్శనప్రభావ
సంసిద్ధ యగు బుద్ధి వృద్ధోపసేవనమునకును గంగాజలనిగ్రహానుగ్రహోపాదన సమ
గ్రం బగు హానసోత్సాహం బింద్రియభంగంబునకును నుత్తరదిగ్విజయయాత్రాధు
రీణంబు లగు చరణంబులు ఊర్ధ్వగమనంబులకును బాల్పడఁ జేసి జగజెట్టిబిరుదంబు నెట్టు
కొనం జేసి తండ్రిఁ గుఱించి తపంబుఁ జేయుచుండ దినంబులు గడచె వారంబు లరిగెఁ
బక్షంబులు సనియె మాసంబులు వోయె ఋతువు లతిక్రమించె సంవత్సరంబు
దాఁటె నయ్యవసరంబున. 11
సీ. తెల్లనిగడ్డంబు తెల్లనిమీసము, ల్నరసినరోమపాండురశిరంబు
మేధావిబొట్టును మెఱుఁగుజన్నిదములు, భూతిలలాటత్రిపుండ్రకంబుఁ
గావిదోవతియును గంతోత్తరీయంబు, నిష్టికోలయుఁ జంక నిట్రితోలుఁ
బంచాంగముష్టియుఁ బాణిఁ బవిత్రంబు, నొక్కవ్రేలికి వెండియుంగరంబు
తే. జాఱుబొజ్జయు నునుదబ్బసంబెలయును, జెత్తగొడుగును జక్కఁ దాల్చి కుతుకమునఁ
దనకు సజ్జాతిగా నొక్క తపసి వృద్ధుఁ, బ్రాహ్మణుండు వచ్చె నొయ్యొయ్యఁ బార్థుకడకు.
వ. వచ్చి యాశీర్వదించి మహాత్మా! నీసంగడంబునం దపంబు చేయవచ్చితి నిచ్చోఁ గొన్ని
దినంబులు క్రూరజంతువులు నన్ను బాధింపకుండ నరసికొని యుండవలయు నని
పల్కి యతనిముందటఁ బరిశ్రాంతుఁడుంబోలెఁ జతికిలంబడి కూర్చుండె. 13
తే. మోఱకునిచందమున నీఱుతాఱుచూపు, పాండవేయునిపైఁ దార్చి బ్రాహ్మణుండు
పలికె నిప్పచ్చరం బైన భాషణములఁ, బరమనాస్తికభావంబు పరిమళింప. 14
తే. అన్న! యెవ్వరివాఁడ వీయడవిలోనఁ, దపము సేసెదు నీమంత్రతంత్రపదులు

పాకశాసనదేవతాప్రార్థనాను, సూచకము లైనయవి యన్నిచూడ నిపుడు. 15

ఉ. చక్కనివాఁడ వెంతయును జల్లనివాఁడవు భాగ్యరేఖఁ బెం
పెక్కినవాఁడ వీవిపిన మెక్కడ నీసుకుమారతాగుణం
బెక్కడ ఘోరవీరతప మీయెలప్రాయమునందుఁ జేయునే
యక్కట యెవ్వఁడైన నకృతాత్ముఁడ వీ వొకరుండు దక్కఁగన్. 16

క. శరచాపధారణంబున్, బరమమనశ్శాంతి దాంతి పరిపాకంబున్
బరికింపఁ "జంకదుడ్డును, శరణార్థియు" నవెడునట్టిచందము దోఁచెన్. 17

క. వైరిమదకుంభికుంభవి, దారణదారుణకృపాణధారలు పరిఘా
కారములు కందమూలో, ద్ధారములకుఁ బాలుపడెఁ గదా నీకరముల్. 18

శా. ఈభద్రాకృతి యిమ్మహాభుజయుగం బీదీర్ఘకోదండ మీ
యాభీలత్వ మెకిం డోకొండ భువనైకాధ్యక్షతాహేతు వే
లాభం బాత్మఁ దలంచి చేసె దొకో గోలాంగూలభల్లూకమ
త్తేభాకీర్ణవనాంతరంబునఁ దపం బేకాగ్రభావంబునన్. 19

తే. ఈశ్వరునిఁ గూర్చి చేసెద వేని లెస్స, మాధవునిఁ గూర్చిచేసిన మాకు హితవు
బ్రహ్మఁగూర్చి చేసిన నది పరమశరము, తగునె యిల వజ్రధరుఁ గూర్చి తపముసేయ.

తే. ఎవ్వఁ డుపదేశ మొసఁగెనె నింద్రుఁ గూర్చి, తపముసేయుము నీ వంచు దయ దలిర్ప
నాతఁ డెఱుఁగఁడు గాక యాయద్రిభేది, గౌతమునియింటఁ జేసిన కాఁడుగోష్ఠి. 21

సీ. ఆసహస్రాక్షునియాత్మసంశుద్ధికిఁ, బరమసంయమియింటిపంచ సాక్షి
యానిర్జితేంద్రబాహావిక్రమమునకు, భుజగాంతకునిరెక్కపోక సాక్షి
యానునాసీరుసహంకారగరిమకు, నిషధాచలముమీఁదినెలవు సాక్షి
యాశచీవల్లభు నాచిత్యకలనకుఁ, దాపసుచేతిపూదండ సాక్షి

తే. యిట్టిదేవేంద్రువలన నీ వేమి ఫలము, వడసెదవు చాలు నీవాంఛ పాడుగాను
వాఁడు నీకంటె నేమిట వాసి గలఁడు, తగదు చాలింపు మీవిరుద్ధంపుఁదపము. 22

వ. అని యెంతచెప్పిన నత్యంతధీరోదాత్తుం డగుపాండుపుత్త్రుం డూరక తపంబు చేయు
చుండె నట్టియేకాగ్రభావంబునకుం బ్రియంబంది వృద్ధబ్రాహ్మణవేషంబు మాని వృద్ధ
శ్రవుండు ప్రత్యక్షుం డై వరంబు వేఁడు మనుటయు. 23

క. గురుభీష్మకర్ణసైంధవ, గురుతనయులతోడఁ గూడఁ గురుపతిబలము
న్బరిమార్చునట్టిసత్త్వము, బురహరునా యిమ్ము కరుణ బొంపిరి వోవన్. 24

వ. అనిన నింద్రుండు సవ్యసాచి కిట్లనియె. 25

తే. భీష్మగురుకర్ణకృపు లనిర్భేద్యబలులు, ద్రౌణిభూరిశ్రవోభగదత్తశల్య
సైంధవులు పేరు గలవారు సమరజయము, శంభుకృప లేక యెబ్భంగి సంభవించు.

వ. పశుపతిఁ గుఱించి తపంబు సేయుము తత్ప్రసాదంబున నీకుం జయం బయ్యెడుఁ బునర్దర్శనంబు గాఁగలయది పోయి వచ్చెద నని యింద్రుం డంతర్ధానంబు చేసె. 27

తే. తండ్రి చెప్పినమాటలు దప్ప కప్పు, డాదరించి ధనంజయుం డభవుఁ గూర్చి
యింద్రకీలాచలంబుపై నేకనిష్ఠ, ధీరుఁ డొనరించె నతిఘోరవీరతపము. 28

మ. భసితోద్ధూళితనిర్మలావయవుఁడు పంచాక్షరీసంతతా
భ్యసనవ్యాప్తిపరాయణుండును శివధ్యానానుసంధాత్రయుక్
మసృణస్నిగ్ధశిరస్కుఁ బ్రమయకంథాభద్రపీఠుండు నై
యసమస్థేమఁ గిరీటి పాశుపతదీక్షారంభముం గైకొనెన్. 29

సీ. ప్రథమసంధ్యారాగపాటి మిన్నేటి, కనకపంకజకోరకములు దెలుపఁ
గందువాటినమించుగచ్ఛటద్దమువోలె, విధుమండలము కాంతి వీడుకొనఁగ
దర మైనవేఁబోకఁ దఱపి వెన్నెలఁ గ్రోలి, దివిఁ జకోరములు మత్తిల్లి యాడ
మందరాచలకూటమధ్యభాగస్థునఁ, గృత్తికానక్షత్ర మత్తమిల్ల

తే. మృదులభస్మరచితశయ్య మేలుకాంచి, యమలరుద్రాక్షధారణం బాచరించి
యర్జునుఁడు పర్ణశాలికాభ్యంతరమున, హాయి నొనరించు నరుణోదయార్చనంబు. 30

క. కపికేతుఁ డింద్రకీలా, ప్రపాతపతయాళునిర్ఝరస్నాతుం డై
యుపచారవిధుల నన్నిటఁ, దపనోదయవేళ వ్యాళధరుఁ బూజించున్. 31

మ. అవధానంబునఁ బాకశాసనసుతుం డర్ధేందుకోటీరు సం
గవకాలంబునఁ బూజసేయు హిమవాఃకర్పూరకస్తూరికా
ద్రవకాలాగరుగంధసారసురభిద్రవ్యంబులం బూవుల
న్లవలీసర్జరసాగురుప్రముఖ నానాధూపధూమంబులన్. 32

శా. పంచబ్రహ్మషడంగబీజసహిత ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్
మించుం గొండయనుంగుఁబెండ్లికొడుకు న్మధ్యాహ్నకాలంబు సే
వించు న్నిర్జరరాజసూనుఁడు మనోవీథి న్సదానందుఁ డై. 33

శా. ఆయావ్రాజినఖండమధ్యమున సేవాబద్ధపద్మాసనుం
డై యింద్రాత్మజుఁ డింద్రకీలశిఖరీంద్రారూఢబిల్వద్రుమ
చ్ఛాయానిర్మలచంద్రకాంతమణి పాషాణప్రదేశంబున
న్సాయంకాలము పూజ సేయు నభవు న్సంధ్యానటున్ ధూర్జటిన్. 34

ఉ. అంచితభక్తితో శివుని నర్ధనిశాసమయంబునందు సే
వించు గురూపదేశపదవీపరిశుద్ధసమర్చనావిధిన్
గాంచనకోరకంబుల బికప్రసవంబులఁ గొండగోఁగులన్
గాంచనకందరాముఖగృహంబులఁ బార్థుఁడు సంస్కృతార్థుఁ డై. 35

వ. ఇట్లు పాశుపతదీక్షాధురంధరుండై కాలకంధరుంగుఱించి తపంబు సేయుచుండఁ గొండొకకాలంబునకు. 36

మ. ఒకనాఁ డింద్రతనూభవుండు గిరికూటోత్సంగభాగంబున
న్వికచానేకలతాతరుప్రతతులన్ దేవార్చనాపుష్పకో
రకము ల్గోయుచు నుండఁగా వినఁబడెన్ శ్రవ్యంబులై కుర్కుర
ప్రకరోదంచితకంఠకాళశివాలీభౌభౌమహారావముల్. 37

తే. చాయగోనులకంటెఁ గేసరులకంటెఁ, బులులకంటెను బిసరులై పొగరుమిగిలి
జల్లుకొని వచ్చెఁ బైపైని సారమేయ, యూథములు వేదమయమూర్తు లుద్ధతముగ. 38

తే. ప్రకటలీల నుదాత్తంపుఫణితిఁ గొన్ని, క్రమముతో ననుదాత్తస్వరములఁ గొన్ని
స్వరితములఁ బ్రచయంబులవరుసఁ గొన్ని, ఘోషణము సేయఁదొడఁగెనాకుర్కురములు.

క. కనకపుశృంఖలలఁ ద్రియా, శునకంబులఁ బట్టుకొనఁగ సూరెలఁ బ్రమథుల్
తను నిరుచక్కియ లీలా, వనచరులై కొలువఁ గపటవైహారికుఁ డై. 40

సీ. వికటపాటలజటామకుటికాభారంబు, కఱుకైనజుంజురు నెఱులు గాఁగఁ
జారుసుధాధామశకలావతంసంబు, పెడకొప్పుపై నుండుపీకె గాఁగ
ఘనలలాటంబునఁ గనుపట్టుకనుచిచ్చు, గైరికద్రవతిలకంబు గాఁగఁ
భుజమధ్యమునఁ గ్రాలుభుజగహారంబులు, గురిజపూసలగుబ్బసరులు గాఁగ

తే. శంకరుండు గిరాతవేషంబు దాల్చి, యగజ చెంచెతయై తోడ నరుగుదేఁ
బాణి నోంకారదివ్యచాపము ధరించి, వచ్చె విప్వచ్చువరతపోవనముకడకు. 41

వ. అట్టిసమయంబున. 42

చ. జలధరనీలదేహమును జంద్రకళాయుగళీసమానదం
ష్ట్రిలు ఛిదగోపమానముఖసంపుటపోత్రము ఫుల్లమేచకో
త్పలదలవర్ణకర్ణములు బాటలవర్తులలోచనంబులుం
గలిగి కఠోరకంఠఘురఘుర్ఘురఘట్టనఘోషజన్యమై. 43

ఉ. మ్రుట్టియ నింద్రనీలతటమూలమహీప్రభవంబులైనవె
న్బట్టులు గ్రుచ్చివైచుచును భూరుహమండముఁ జాఁపకట్టుగా
మట్టుచు ఘుర్ఘురధ్వనుల మాటికిమాటికి దిక్తటంబులం
ఘట్టన చేయుచు న్వెడఁదకన్నుల నిప్పులు వెళ్లఁగ్రాయుచున్. 44

క. వఁది పడిఁ బాఱుదెంచెఁ బు, ందరసందననిశాకరధరులనడుమన్
దండడి గౌరిజలతాంకునఁ, గందుకములుపోలె శిలలు గదువాఱంగన్. 45

ఉ. ఏసెఁ బినాకచాపమున నీశుఁడు గాండివకార్ముకంబునన్
వాసవసూతి యాప్రబలవజ్రసమానము లైనబాణముల్

రా నెఁ బరస్పరంబును వరాహము ప్రక్కలు గాడిపాఱ మూ
కాసురసూకరంబు దిరుగాడె వడి న్శరఘాతవేదనన్. 46

క. అథ వార్జునశరపాత, ప్రథవవ్యథఁ దిరిగె నవ్వరాహము కడు సం
క్షుభిత మయి విలయవేళా, నభస్వదుద్భ్రాంతఘనఘనాఘనము క్రియన్. 47

క. దీర్ఘతరహారవరాశుగ, నిర్ఘాతనిపాతజాతనిబిడవ్యథ సం
తర్ఘూర్ణమాన మగుచును, ఘుర్ఘురఘోషంబుతోడఁ గ్రోడము గూలెన్. 48

వ. అప్పుడు గిరాతవేషధారి యగుపురారి యోంకారచాపంబు నేల నిలువం బెట్టి తదీయ
శిఖరంబున నఱచెయి మోపి మొరగి మొయ్యారంపునిలుకడ నిలిచి వలకేల వాలమ్ము
ద్రిప్పుచుఁ గట్టెదుర నున్న జగజెట్టి యగునింద్రునిపట్టిం గనుంగొని ప్రావృషేణ్యప
యోవాహగర్జాగంభీరం బైనస్వరంబున నింద్రకీలగిరిగహ్వరంబులు ప్రతిధ్వని యొసఁ
గ సాటోపంబుగా సగర్వంబుగా సావష్టంభంబుగా నిట్లనియె. 49

తే. ఎవ్వఁడవురోరి నీవు నాయెదురఁ బాఱు, పంది నేసితి బాహుదర్పంబు మెఱసి
యెఱుఁగవుర యోరి నన్ను నీయింద్రకీల, పర్వతంబేలు వనచరసార్వభౌము. 50

ఉ. నేనును నాకుటుంబ మగునీతరళాక్షియు వెంట వెల్వ యి
క్కాననభూమిలో బహుమృగంబులఁ జంపుచు వచ్చివచ్చి యే
నీనిశితాస్త్రపాతమున నిక్కిటిఁ జంపుదు నంచు వాక్ప్రతి
జ్ఞానియమంబున న్వెనుకఁ జాడఁగ గూడఁగ వచ్చుచుండఁగన్. 51

క. వేఁట నలసి యీచెంచెత, యోటమివెట్టం గడంగి యున్నట్టియెడన్
గాటెఱుఁగు గోలవింటన్, జీటంబున వేడ్కయెల్లఁ జెఱచితి కదరా. 52

తే. తపసి వై యుండి తగు రోరి ధనువుఁ బట్ట, శాంతిపరులకు నేలరా సత్త్వహింస
కపటధారివి రత్యంతకల్మషాత్మ, యెవ్వఁడవు రోరి నాపంది నేయ నీవు. 53

క. మండెడుబలునారసమున, గుండియ పగులంగ నేసి కూల్చితి దీనిన్
వెండి ప్రయోజన మేదీ, రండాసుతి! దీనిపై శరము నిగుడింపన్. 54

చ. శబరసివి గానఁ జావునకుఁ దప్పితి నీ కిది వేఁటపంతమా
యబలుఁడ నీకెఱుంగునఁ బరాటవికాయతచాపవల్లరీ
నిబిడశరాహతిం బగువనేచరజంతువు నేసి తీగలన్
సబముపయి న్నిగుడ్చినశాకశిలీముఖ మెట్టిపెట్టితో. 55

వ. అనినం గిరీటి యయ్యాటవికచక్రవర్తి కిట్లనియె. 56

క. పైవచ్చు క్రూరజంతువుఁ, జేవెరవున నేయ బొందు సిగ్గే చెపుమా
యీవక్రభాషణంబులు, నీ వాడెదు శబర పొమ్ము నీ నను త్రోవన్. 57

క. పంది నపేక్షించితివో, పందెము గెలువంగ వేడ్కఁ బడియెద వేదో
కందువుగా కాఫలము పు, ళిందాధిప యేమిటికిఁ బలికెదీభంగిన్. 58

మ. తడవేలోరి పులిందరాజ, తను మధ్యాహ్నంబు డాయంగ న
య్యెడ నీవేళ శివార్చనంబునకు మా కేకాంతమై యుండఁగాఁ
బడు నీవుం గడు డస్సినాఁడ వటవీపంక్తిప్రచారంబులన్
విడు కోపం బిది శాంతి గైకొనుము వాగ్వివాద మిం తేటికిన్. 59

క. జోటియు నీవును గుర్కుర, కోటియు ననుచరులు డస్సిపోన్నారు మహా
ఘాటిపరిశ్రమమున ని, చ్చోట వసించెదర యేని సుఖముండఁ దగున్. 60

వ. అని యర్జునుండు పల్కిన నాగజ్జులాఁడు మోఱకంబున మొగ మడ్డంబు గదల్చి యీ యెడ్డిమాటలం బనిలే దీపంది యొక్క ప్రయోజనంబె వేఁటపతంబు దప్పి మమ్ము నధిక్షేపించితి వీతప్పునకుఁ దపసివిగాన నిన్ను శిక్షింపను పాష్మదియునుం గాక. 61

ఆ. తాటియంతవిల్లు ధరియించినాఁడవు, జ్యాకిణాంకితము భుజాయుగంబు
గర్వరేఖ మిగులఁ గానంగ నయ్యెడు, దాంభికంబు నీదుతపసితనము. 62

శా. ఏమో నాహృదయంబు నిన్నుఁ గని యిట్లే చాపమం దాసమై
భామాసన్నిధి నుబ్బుచున్నయది నీబాహాప్రతాపంబు ని
స్సీమం బే నొకకొంతసే పిచట నుజ్జృంభించరాఁ జేయుమా
నామీఁద న్నిగుడింపుమా నిశితనానాక్రూరనారాచముల్. 63

క. చెంచని నన్నుం జూడకు, వంచింపకు హీనజాతివాఁ డని సంగ్రా
మాంచలమున నిదె నను మె, చ్చించెదవే నపుడు నిన్ను సేబాసందున్. 64

మ. శివలింగార్చన మెందుఁబోయెడుఁ దపస్విత్వమ్ము సెందే నుప
ద్రవముం బొందదులే యొకింతవడిలో ధ్యానానుసంధానముల్
వ్యవధానం బొకయింత సైఁచవొకో బాహావిక్రమశ్రీమహో
త్సవముం జూపుదుగాక నాయెదుర నాశ్చర్యం బవార్యంబుగన్. 65

తే. ప్రదరపరివోయు మేయుము ప్రాక్పరికార, కౌతుకాధీనహృదయుండఁ గాను నేను
శౌర కుంపత్ని యైయలయానీరజాక్షి, యాసపడుచుండు ఘోరవీరాహవములు. 66

వ. అని పల్కి యాక్రీడాకిరాతుండు గుణధ్వని చేసిన జలధరధ్వానగంభీరంబై యేతెంచు నాక్రోఁతకు సిళ్ళు చూపిఁ గోపించు గంధద్విపంబుంబోలె ఘోషించి యర్జునుండు గాండీవగుణగర్జాడంబరంబున నంబరంబు పిక్కటిల్ల నాటకకిరివిలుకానిపై భల్లంబులు నిగుడించె. 67

శా. గాండీవప్రవిముక్తనిష్ఠురమహాకాండప్రకాండంబులన్
ఖండించె న్బ్రతిబాణఘట్టనమునం గంధర్వవిద్వేషి యా
తం డాశ్చర్యము నొంది బాపురె పుళిందశ్రేష్ఠ, యంచు న్భుజా
దండాహంకృతి వెండియుం జఱపె శాతక్రూరనారాచముల్. 68

శా. ప్రారంభం బొకయింత లేకను దృణప్రాయంబున ట్లొందఁగాఁ
గ్రూరాజిం దెగ నేసెనో నటికెనో క్రొవ్వాఁడిఅంపంబుచే
నీరీతిం దునుమాడవచ్చునె యనన్ హేలాగతిం ద్రుంచె దు
ర్వ్యాగాహంకృతి నీశ్వరుఁడు విజయాస్త్రవ్రాతముల్ వ్రేల్మిడిన్. 69

క. శితికంఠుఁ డేయు శరములు, ప్రతిహతములు సేయు నరుఁడు పార్థునిశరముల్
శితికంఠుఁ డేయుశరములఁ, బ్రతిహతములు సేయు బహుళబాహాప్రౌఢిన్. 70

క. క్రూరతరహరనరాశుగ, నారాచశిలీముఖాదినానాస్త్రఘటా
నీరంధ్ర మైననభమునఁ, గారుకొనియె గాఢ మంధకారము దిశలన్. 71

క. ఓంకారగాండివజ్యా, టంకారంబులు నభఃకటాహము నిండెన్
శంకరకపికేతుభుజా, హంకారనిరంకుశాహవాంగణభూమిన్. 72

వ. ఇట్లోహరిసాహాసల్లాడుహరార్జునులయందు. 73

క. శరధులు యుగాంతవేళా, శరధులునుం బోలె నయ్యె శరశూన్యంబుల్
సురపతిసూతికిఁ బరమే, శ్వరమాయాశక్తి నపుడు సమరాగ్రమునన్. 74

మ. తెలివిం బొందక యుండె నెమ్మనమునం దివ్యాస్త్రమంత్రాక్షరం
బులు శారద్వతకుంభసంభవులసంబోధంబు సర్వంబు ని
ష్ఫల మయ్యెన్ వృథ యయ్యె నాంతరకృపాభ్యాసంబు గాండీవికిన్
గలహక్షోణిఁ బినాకపాణికుహనాకౌటిల్యశిల్పంబునన్. 75

క. నిటలవిలోచనమాయా, ఘటనమునఁ గిరీటి తనప్రగల్భత చెడినన్
గుటిలముగ బొమలు ముడిచెను, గటకటఁ బడఁ దొడఁగె నపుడు కరము సెమర్చెన్.

శా. కాండక్షీణత నాయుషుచ్ఛటలకుం గల్గెంగదే సాధనుః
పాండిత్యం బెటువోయె నొక్కొ యని చెప్పం జిట్టలేఁ గాక యా
తం డీలాగునఁ బోవువాఁడె యయి మైఁ దా నంచు గర్వోద్ధతిన్
గాండీవంబున బూన్చి వేయఁ దొడఁగ న్గాండీవి గంగాధరున్. 77

క. మృదు వెన్నఁడు శరములఁ గ, వ్వడి బొదువం దొడఁగె గాండివంబున నపుడే
యుడుగక పాద మెడుభయమున, వడఁకులగుబ్బలికుమారి వడవడ వడఁకెన్. 78

సీ. కఱకు వెండ్రుకలలోఁ బఱచుమందాకిని, సుకుమారదేహంబు స్రుక్కఁ బాఱె
నవతంసకుసుమమాల్యం బైనశశిరేఖ, బ్రహ్మకపాలరంధ్రమునఁ దూఱె
నెట్టియంబుగ బిగ్గఁ జుట్టిన పెనుబాము, బిగియూడి నొసలిపై డిగఁగ జాఱె
నలికనేత్రముకిత్తి యారజ్యమానమై, యెప్పులసందుల నిప్పు లుమిసె
తే. నగజ భయమందెఁ బ్రమథులు బెగడు గుడిచి, రుపనిషత్తులు ఘోషించె నొక్కపెట్టఁ
గాలకంఠునిమౌళిశృంగాటకంబు, గాండివంబునఁ దాడింప పాండవుండు. 79
తే. పాండునందనఘనభుజాదండకలిత, చండగాండీవతాడితఖండపరశు
పృథుజటామండలంబునఁ బిండుగట్టి, తాండవం బాడె మున్నేటితరఁగదండు. 80
తే. వింటఁ గొని వ్రేయు వ్రేయఁగ వినుగు వుట్టెఁ, జెట్టిబిరు దింతె పొమ్మని పట్టి యణఁచె
సురతనూభవునిం బట్టి శూలపాణి, మల్లసంగ్రామకేళిసంభావనముల. 81
క. కపికేతువృషభకేతను, లుపజాతనియుద్ధకౌతుకోత్సాహమునన్
నిపుణతఁ బెనఁగంగఁ దొడఁగి, రుపతాయి న్వ్యేషభాష లుపలాస్యముగన్. 82
తే. తోరహత్తంబునందుఁ బార్థుండు గడిమి, సలిపె నూరులు బీడించె సరభసమున
హరుఁడు సీసాన హత్తించి యర్జునునకు, బరువు గావించె నిశ్వాసపవనమునకు. 83
క. ముక్కంటి కంఠమూలము, డొక్కరమున నిఱికె బార్థుఁడు ప్రబంధుండై
చక్కని ప్రకోష్ఠపీడన, మిక్కిలికను వేఁకి నుఱికె మినుమినుకుమనన్. 84
క. తాఁచుచుఁ బొడుచుచుఁ బడుచును, నేఁచుచు నుడుకుచును బిట్టు నెగయుచు గూలం
ద్రోఁచుచుఁ దూలుచుఁ బెనఁగిరి, ప్రాచీపతిసుతుఁడు హరుఁడు బాహాబాహిన్. 85
శా. నిష్టంకించి శశాంకశేఖరుఁడు గాండీవాయుధుండు న్భుజా
వష్టంభంబులు సిద్ధచారణులు గైవారంబు గావింపఁగా
దిష్టాంతాంతకఘోరమూర్తు లయి సాదృశ్యం బదృశ్యంబుగా
ముష్టీముష్టి రణంబు చేసిరి యసన్మోహప్రకారంబులన్. 86
క. చెమరుచుట యాడు గిఱుచుట, బొమ ముడుచుట నిర్వికారమును మును నపరి
శ్రమమును సరిసరిఁ బెనఁగిరి, సమవిషమనియుద్ధకేలి శంభుఁడు నరుఁడున్. 87
క. తాటించెఁ బేరణము నా, స్ఫోటించెఁ గిగీటివక్షము వృషాంకుఁ డతం
డాటోపమఱి పిడికిటి, పోటున ధూర్జటియురంబుఁ బొడిచెం గడిమిన్. 88
శా. అంతం జంద్రకళాధరుండు నిజబాహాగాఢపీడాపరి
శ్రాంతుండై యటఁ బాండుసూతియెదురం బ్రత్యక్షమయ్యెం గృపా
వంతుండై యహిరాజహారములతో స్స్వర్వాహినీవేణితో
దంతిత్వక్పరిధానపల్లవముతోఁ దామ్రజ్జటాపంక్తితోన్. 89

ఉ. చెంచెత యయ్యెఁ బార్వతియుఁ జెంచులు భూతములై నిజాకృతి
న్మించిరి వేలుపు ల్నభమువీఁద లలాటమునందు నంజలు
ల్నించి నమస్కరించిరి వినీతియు భక్తియు నుల్లసిల్లఁ గా
వించెఁ బ్రణామము ల్గరము విస్మయ మందుచుఁ బార్థుఁ డత్తటిన్. 90

తే. వేదము ల్నాల్గు నుపనిషద్విద్యఁ గూడి, ప్రణవమంత్రాక్షరములతోఁ బ్రస్ఫుటముగ
విశ్వకర్త్రాత్వ మెయ్యెయ్య వీడుకొనుచు, నభినుతింపంగఁ దొడఁగెఁ జంద్రార్ధమౌళి.

వ. అప్పుడు పార్థుఁడు కృతార్థుండై రోమాంచితకంచుకితాఖిలాంగుండై యానందబాష్ప
లోచనుండై కేలుదోయి ఫాలభాగంబునం గీలుకొల్పి యిట్లని స్తుతించె. 92

క. నీవ పరబ్రహ్మంబవు, నీ వఖిలాండాండపతివి నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యయుక్, ప్రావీణ్యప్రాభవైకఫలదుఁడవు శివా!. 93

క. నిన్నుఁ ద్రిజగన్నివాసుని, బన్నగకంకణుని భక్తపతంత్రుని న
భ్యున్నతకరుణాగుణసం, పన్నుని గనుఁగొంటి మంటి బాలేందుధరా!. 94

క. నీచేతఁ గృపాసిద్ధిచే, వాచాగోచరవివేకవైయ్యాత్మునిచే
నోచంద్రకలాశేఖర!, యాచించి మనోరథార్థ మర్థిం గందున్. 95

శా. నీకై యేను దపంబు చేసితి మహానిష్ఠాగరిష్ఠస్థితి
న్నీకై సంస్తుతి సేయుదుం గడఁగి నానేర్పొప్పఁగా నెంతయు
న్నీకై పూజ యొనర్తుఁ గొంత విరుల న్నిత్యంబు సద్భక్తితో
నీకై సేవ యహర్నిశం బొనరుతు న్వేదండచర్మాంబరా!. 96

తే. సాటి యెవ్వరు నీకు నిశాటభూప!, కైటభారాతిహాటకగర్భవంద్య!
ఘనజటాజూటవాటికాఘటితవికట, గగనగంగాప్రవంతిక! కరటివైరి!. 97

క. నీయందు జగము లుండుం, బాయక యాజగములందుఁ బాయక నీ వుం
దీయనువు దెలియ నజునకు, నోయజనేత్రునకు నైనఁ దోఁపదు శర్వా!. 98

మ. జయ సర్వేశ్వర! సర్వలోకజనకా! చంద్రార్ధచూడామణీ!
జయ కామాంతక! కామితార్థఫలదా! చక్షుశ్శ్రవఃకుండలా!
జయ సంపూర్ణకృపాసుధైకవసతీ! శైలేంద్రజావల్లభా!
జయ దక్షాధ్వరమర్దనా! జయ గిరీశా! యీశ! రక్షింపవే. 99

ఉ. కొండకిరాతుఁ డంచుఁ గయికోక యసంగతభాషణంబు లు
ద్దండత నాడితిన్ గర ముదగ్రత నొంచితి ముష్టిఘట్టనం
గాండివచాపదండమునఁ గ్రచ్చఱ మోదితి మౌళి భోగభృ
త్కుండల! పెక్కుచందముల ద్రోహము చేసితి నేమి సేయుదున్. 100

వ. అని మఱియు మఱియు సాష్టాంగప్రణామంబు లాచరించి నిలిచిన పాండవమధ్యముం జూచి ఖండపరశుండు నీతపంబునకుం బాశుపతవ్రతనిష్ఠాగరిష్ఠతకు భుజాశౌర్యంబునకు సంతసిల్లితి నీవరం బేదియో వేఁడు మనుటయు. 101

తే. అభవ! యీ నాకు నీప్సితం బగువరంబు, దయఁ బ్రసాదించి రక్షింపఁ దలఁచితేని
రౌద్రమై ఘోరమై లోకరక్షయైన, పాశుపతసంజ్ఞ మగుదివ్యబాణ మిమ్ము. 102

వ. అనినం బ్రీతచేతస్కుండై శంభుండు శాంభవీహృదయానురాగంబునను బ్రమథపరివారసమక్షంబునను మందస్మితంబు కందళింపఁ గరుణాకటాక్షవీక్షణంబున నప్పాండుకుమారుం జూచి త్రిపురదైతేయసుందరీవదనారవిందవాసరావసానసంధ్యాసమయసమారంభంబును గరటిదనుజకుంభకూటకూటపాకలజ్వరస్తోమంబును జలధరజలధరవ్యూహఝంఝూసమీరంబును నంధకాసురప్రద్యోతనప్రభామండలంబును శార్దూలదానవారణ్యహవ్యవాహంబును నగునమ్మహనీయదివ్యాస్త్రంబు ససంప్రయోగంబు సోపసంహారంబు సకీలకంబు సరహస్యంబుగా నుపదేశించె నప్పుడు సేవాసమాపన్ను లగుకిన్నరకింపురుషగరుడగంధర్వవిద్యాధరులు తమతమదివ్యాయుధంబు లిచ్చిరి పార్వతీదేవి యక్షయబాణతూణీరంబు లొసంగె దండధరుండు దండంబును బాశపాణి పాశంబును నింద్రుండు వజ్రంబును సమర్పించి రిట్లు వరప్రదానంబు సేసి యీశానుండు సపరివారుండు సాంబుండునై యంతర్ధానంబు చేసె ననంతరంబ. 103

తే. పరమసంతోషమునఁ బొంది బలవిరోధి, పుత్త్రుఁ గౌఁగిటఁ జేర్చె యాపోనికూర్మి
సమ్మదాశ్రుకణంబులు సంప్రఫుల్ల, చక్షురంభోజదళసహస్రమునఁ బొడమ. 104

వ. ఇట్లనియె. 105

ఉ. భాగ్యముగాదె యశ్రమమ పన్నగకంకణుచేఁ దపఃక్రియా
యోగ్యతఁ జేసి విశ్వభువనోపకృతిప్రతిపాదనైకసౌ
భాగ్యధురంధరం బయిన పాశుపతాస్త్రముఁ గాంచి తింక వై
రాగ్యము పుట్టుఁ గాక కురురాజుపయి న్నిజరాజ్యలక్ష్మికిన్. 106

వ. నీవు నారాయణసఖుండవైన యాదిమునీశ్వరుండవు. నరనారాయణులవలనఁ ద్రివిష్టపంబునకుం బెక్కులోయాములు రాక్షసబాధలు శాంతిం బొందె. నిప్పుడు హిరణ్యపురనివాసులు నివాతకవచకాలకేయాదు లగుదైతేయులు రాజ్యలుబ్ధులై నాకంబున కనేకప్రకారంబుల నుపద్రవం బాపాదించుచున్నవారు. వారిం బరిమార్చి నమరావతీపురంబునఁ గొన్నిదినంబులు వ్రతోపవాసప్రయాసఖేదం బపనయించి మధ్యమలోకంబునకుం గ్రమ్మఱ నేతెంచునది. మాతలిసారథికం బగురథంబు పుత్తెంచెద నిచ్చోటన యుండునది యని తత్కాలసన్నిహితుం డైన మహర్షుం డను మునిం

జూని నీవు ద్వైతవనంబునకుం బోయి పాండవుల కర్జునుకుశలవార్తయుఁ బాశుపతాస్త్రలాభంబును స్వర్గగమనంబుం జెప్పు మని పల్కి యింద్రుండు నిజస్థానంబున కరిగె. 107

తే. విశ్రమించె నొక్కవృక్షంబుక్రిందఁ, నర్జునుండు మణిశిలాంతరమున
దండపరశుబాహుదండనిష్పీడన, ముష్టిఘాతఖేదమోక్షమునకు 108

శా. మాళిం గోహాళి సంఘటించినక్రియ న్మధ్యాహ్నవేళ న్మహా
కాళం బైననభోవిభాగమున వీఁకం గాసె బీరెండయా
ప్రాలేయాహితసంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టి యై. 109

వ. అప్పుడు మధ్యాహ్నకాలపూజకు నాయితం బై. 110

సీ. పావననిర్ఝరాంభఃప్రవాహంబున, నఘనుర్షణస్నాన మాచరించి
కసటువోఁ దెలినీటఁ గడిగి యార్చినట్టి, సలిలకాషాయవల్కలము గట్టి
యాపాదమస్తకం బఖిలాంగకంబులఁ, గమ్మనిభసితంబు గలయ నలఁది
నెడఁదముత్యములతో నెడవెట్టి గ్రుచ్చిన, మంచిరుద్రాక్షదామములు దాల్చి

తే. పులికళానంబుగద్దెపైఁ బూన్కి మెఱయఁ, బంచశుద్ధులు గాంచి పాండుసుతుఁడు
షోడశోపచారంబులు సొంపిదీర్చె, నీలగళునకు మధ్యాహ్నకాలవేళ. 111

వ. ఇట్లు శివలింగార్చనంబు దీర్చి కందమూలఫలోపహారంబులు సమర్పించి తత్ప్రసాదంబునఁ దాను దేహయాత్ర నడపి విశ్రాంతుం డై యున్నసమయంబున ధవళహయసహస్రంబులఁ బూన్చినరథంబు గొని వచ్చి మాతలి తనకుం బెడమూసిన సబహుమానంబుగా నాదరించి పురందరాదేశంబున నద్దివ్యస్యందనం బెక్కి యాకాశమార్గంబునం జనునప్పుడు. 112

సీ. ఇవి మేఘమండలం బివి విమానంబులు, యక్షవిద్యాధరోపాశ్రయంబు
లిది యాహవస్కంధ మది తారకావీథి, యల్లతెల్లనిరేఖ యభ్రగంగ
యల్లది శింశుమారాకారపుంమూర్తి, వీఁడె భాస్వంతుఁడు వాఁడె ధ్రువుఁడు
వీర సప్తర్షులు వారె యశ్వినులాదు, లిరువాడ దేవేరు లిందుభార్య

తే. లల్లవాఁడె సుధాకరుం డవె గ్రహంబు, లివ్వలాఖ్యంబు లగుచుక్క లివె కెలఁకుల
ననుచు మాతలి చూపంగ నర్జునుండు, కౌతుకం బంది గగనమార్గంబునందు. 113

శా. జంభారాతితనూజుమీఁదఁ బొలిచెఁ సావిత్రివర్త్మంబున
న్జృంభిన్మోదరశాతకుంభనలినీనాళీకసంవాసనా

సంభారంబులు సోడు ముట్ట సవిధస్వర్లోకకల్లోలినీ
గంభీరాంబుతరంగసంభ్రమములం గల్యాణవాతూలముల్. 114

తే. అర్జునునిమీఁదఁ బొలిచెఁ బభ్యంతరమున, నభ్రగంగానదీతరంగానిలంబు
నందనోద్యానవీథికాసవలతాంత, సారభాసురహరినీలహారమగుచు. 115

వ. ఇవ్విధంబున మాతలిసారథికం బైనయారథంబుమీఁద నక్షత్రమండలం బొలసి
కొనుచుం జని యర్జునుం డమరావతిం బ్రవేశించి దివ్యాంగనాపాంగభంగీసమాలిం
గితసౌభాగ్యుం డై రాజమార్గంబునం జని దివ్యమందిరంబుఁ బ్రవేశించి సుధర్మాభి
ధానం బైనయాస్థానమండపంబునఁ గొలువున్న మహేంద్రునర్ధాసనంబున నుండె.

తే. వీడుపట్టుగ మందారవిపినవీథి, దివ్యసౌధంబునందుఁ బ్రతిష్ఠఁ జేసి
గారవించె జయంతకుమారుకంటెఁ, బాండురాజతనూజు నాఖండలుండు. 117

వ. అనిశాసమయంబున. 118

సీ. పదునాల్గుజాతుల త్రిదశాంగనలయందుఁ బేరుఁబెంపును గలనీరజాక్షి
నీరజనాభునియూరుకాండంబున, నుద్భవం బందినయుజ్జ్వలాంగి
యంభోనిధానంబు నాపోశనము గొన్న, కలశసంభవుఁ గన్న కంబుకంఠి
వసుధయందుఁ బురూరవశ్చక్రవర్తికిఁ, బ్రాణవల్లభ యైన పద్మనయన

తే. కట్టి తోడి పూసి కైసేసి కౌతుకమునఁ, గొస డిగఁగ నీలిపుట్టంబు ముసుఁగువెట్టి
గాజు లెగఁద్రోసి చప్పుడుగాక యుండ వచ్చె నూర్వసి యర్జునావాసమునకు. 119

చ. విమలసుధాంశుకాంతమణివేదికపై నవహంసతూలత
ల్పమునఁ సుఖప్రసుప్తిపరిపాకము నొంది విశాలనేత్రప
ద్మములు మొగిడ్చి శేషఫణిపైఁ బవళించినయంబుజాక్షు భా
వమునఁ గరంబుఁ బొల్పమరువానిఁ గనుంగొనె నింతి పార్థునిన్. 120

తే. మేల్కొలిపి యిందబింబాస్య మెల్ల మెల్లఁ, బ్రమదసంద్రాపరాధీనుఁ బాండుతనయుఁ
బగడములఁ బోలుతనపాణిపల్లవముల, నతనిమృదుపాదకంకేరుహంబు లొత్తె.

వ. మేల్కని యర్జునుండు నిర్జరలోకలలామం బైనయబ్భామినీరత్నంబుం గనుంగొని
పాన్పు డిగ్గి యభివాదనంబు సేసి వినయవినమితోత్తమాంగుండై యిట్లనియె. 122

తే. ఈనడికిరేయి నొంటిమై యింతదూర, మేమికార్యంబు మదిఁ గోరి యేగుదెంచి
తేను సమ్మన్న రానె పూర్ణేందువదన, చెప్పుమీ పాన్పుమీఁద నిచ్చేసియుండు.

ఉ. అడఁగఁబోవుతీర్థ మెదురైనవిధంబున నెల్లి యేను శే
పాడియ చంద్రశేఖరు నుపాస్తి యొనర్చి యుపాయనంబుతోఁ

జూడఁగవచ్చువాఁడ నయి చూచుచు నుండఁగ నీవ వచ్చితో
చేడియ యెట్టిపుణ్యములు చేసినవాఁడనొ ప్రాగ్భవంబునన్. 124

శా. మత్తారాతివిదారణుండు జనసన్మాన్యుండు శీతాంశువం
శోత్తంసంబు పురూరవుండు ప్రచలద్యోగుండు మాతాతగార
రత్తోయాకరమేఖలాపతికి నిల్లా లైతిగా కావున
స్మత్తో వీ విధి లెస్స మన్మనిపయిన్మోహంబు వాటింపఁగన్. 125

తే. ఆదినారాయణునియూరు వంబుజాక్షి!, భువనవిఖ్యాత మైననీపుట్టినిల్లు
పావనుఁడ నైతి నీపాదపద్మములకు, వందనముఁజేసి వరభక్తివైభవమున. 126

వ. అని పెక్కుప్రకారంబుల నిర్వికారుండై పాండుకుమారుండు ప్రియంబు చెప్పిన
నప్పువ్వుఁబోఁడి కప్పలుకు లొప్పులయ్యును నీరుడప్పికి నేయునుం బోలి యప్పటి
కప్రియంబులై యుండె నిచ్ఛావిఘాతంబు నొందియు నమ్మచ్చెకంటి చేతోభవవికా
రంబు హరింపం జాలక ధనంజయున కిట్లనియె. 127

తే. ఏల యెన్నొతరంబుల నీశఁ బడ్డ, పెద్దవాపులు శోధించి గుద్దలింప
వారకాంతాజనములకు వావి గలదె, మాను మర్జున మొగమోట లేనిమాట. 128

ఉ. వాసవునిండుఁగొల్వునకు వచ్చినయప్పుడు రత్నమంచితా
ర్ధాసన మెక్కియున్ననిను నంగజసన్నిభుఁజూచి పుష్పబా
ణాసనుపుష్పబాణనివహమ్ములకుం గురి యైతి నిట్టినా
యాస నిరాకరింపఁ దగవా మగవాఁడవు కావ యర్జునా!. 129

తే. ప్రమద మెసలారఁ బాంచాలరాజసుతకు, వలచి చేసితివో సత్యవాక్ప్రతిజ్ఞ
యన్యకాంతలదెసఁబోవ ననుచు నీవు, భామలకుఁ జేయుసత్యంబు పాడి గాదు.

క. నామోహము నావేడుక, నామానము నాప్రియంబు నాతగులము నా
ప్రేమమ్మును నాతెగువయు, క్షామముఁ బొందంగ నూఁగకయె పోవుదునే. 131

చ. అతులితధైర్యశౌర్యమహిమాద్భుతసాహసులై మహోగ్రతా
ప్రతతనిశాతనిష్కృపకృపాణవిదారితదేహులై రణ
క్షితిఁ బడి వత్తురైదుపదిసేయక నాకయి యిట్టినన్ను నీ
వితరులఁ బోలెఁ గైకొనక యేఁచెద వక్కట పాండునందనా!. 132

క. వేసాలఁ బోకు రమ్మా, పూసజ్జకుఁ బ్రొద్దువోయెఁ బులియుట చాలున్
వాసవనందన కుసుమశరాసనకేళీకలావిహారంబులకున్. 133

వ. అని పల్కి యంత నిలువక బ్రహ్మచర్యవ్రతదీక్షాపరాయణుండవె నీ వనుచు నారా
యణోరుస్తంభంబున సంభవించిన యయ్యచ్చరలేమ లేమొలక నవ్వు లపాంగంబునం

దొంగలింపఁ గంకణఝుణఝుణత్కారంబు తోరంబుగాఁ గెంగేలికేళికమలంబునఁ బరాగరేణుత్రసరేణువిసరంబులతోడఁగూడి మకరందబిందుధారాస్యందంబు చిందఁ బురందరపదనులి వ్రేసె వ్రేసిన నత్యంతధీరోదాత్తుండు గావునఁ జిత్తభవసమ్మోహనాస్త్రవిదారణంబునకుం దార యగున వ్వేటున కంతరంబున మిసిమింతుండునుం గాక యేపాకంబునకు రాక రాకాచంద్రబింబంబులోని నెమ్మోము వాంచి నిర్వికారుండై యూరకుండె నివ్విధంబున నయ్యూర్వసియు వసిమాలఁ బెంగి యక్కిరీటి చిక్కని మనంబుపక్క గానక కానక కాసినవెన్నెలయుంబోలెఁ దనకన్నులవలపు మిన్నక పాలివోయినం జిన్నవోయి నిట్టూర్పులు నిగిడించుచు మనోరథవిఘాతప్రభవం బైన కోపంబు సైరింపక నరు సుద్దేశించి నపుంసకుండవుంబోలె నాన గొన్నాఁడ వేఁడు కాలంబు నపుంసకుండవు గమ్మని శపించి దిగ్గన లేచి మొగంబు గంటువెట్టుకొని యింటికిం బోయె. యుధిష్ఠిరానుజుండును వసిష్ఠజనివలన గతకీర్తితాపన్నుండై యయ్యారిష్టంబునకు సంతాపంబు నొందక యది విధివశంబుగాఁ దలంచుచుండె నప్పుడు గగనంబు క్రేవంబడి యస్తమండలుండై హిమగభస్తి విరహవేదనాదూయమానమానస యగు మైత్రావరుణజనయిత్రి ఖిన్నవదనంబునుంబోలె వెలవెలఁ బాఱ విభావరీసమయంబునం ద్రిభాగావశేషం బగుటయు. 134

సీ. పారిజాతకలతాపల్లవంబులు మేసి, కొసరె నుద్యానపుంస్కోకిలములు
గంధరాగశ్రీ వేయకనకఘంటిక మ్రోయ, వేఁప జేనిక యుపవీధికి వెడలె
మందాకినీవీచిమారుతం బల్లార్చె, నప్సరస్త్రీస్త్రీలనీలాలకముల
సప్తర్షి పావనాశ్రమవనాంతరమున, నామ్నాయఘోష మభ్యధిక మయ్యెఁ

తే. బాలవత్సంబుపైఁ గుర్మి బచ్చడిలుచుఁ, గామధుగ్గవివచ్చహుంకార మెచ్చె
శుక్రుగడిసూరమున మించె శంఖరవము, విబుధలోకంబునందలి వేగుఁబోక 135

తే. మర్త్యలోకంబువారి ప్రమాణసంఖ్యఁ, బాండునూనుండు గడపెను వజ్రియింట
సగము నిద్రయును సగము జాగరమును, నావిభావరి వేగుఁబోకాఱు నెలలు. 136

సీ. మాటుగా వైచినమాంజిష్ఠతెర యెత్తి, పంజుమంచము డిగ్గె మంజుఘోష
మొకరమ్ము బైలిమ్రోఁత ముద్దుచూపఁగ రంభ, కనకంపుగొడుగు పాగరు దొడిగ
నొకట వేసలి మడ్చి యొక్కకేల ఘృతాచి, గూజుటెక్కలతలుప్ప గడియపుచ్చె
నలసభావముతోడ నలవోక ప్రమ్లోచ, నిల్వుటద్దంబులోఁ నీడ చూచె

తే. హరిణి గీలించె నలినపట్టాంశుకంబు, మేనక ధరించెఁ బాలిండ్లమీఁద అవిక
యప్సరస్త్రీనికేతనాభ్యంతరములఁ, గొక్కరోకో యటంచును గోళ్లు గూసె. 137

మ. అమరాపత్యమ్ము తాళను ల్పరిథమసంధ్యా వేళ వాల్గన్నలం
గమలాప్తుం గని యాచరించిరి నమస్కారంబు క్రిందైన మ
ధ్యమలోకంబున దివ్యదంశువుల నీహారప్రతానంబు భం
గమునొందించుచు మిన్నుఁ బ్రాఁకె నుదయగ్రావప్రదేశంబునన్. 138

సీ. పక్షమ్ము పావనపాణిపల్లవములు, ఫాలభాగములపైఁ బవ్వళింపఁ
బౌలోమి పెంచిన బాలకోకద్వయం, బలఁతిలియా రెండకు నట్టు సాప
గగనకల్లోలినీకనకపద్మములపైఁ, దుమ్మెద లెగసి జుం జుమ్మ రనఁగ
నాకవిద్యాధరీనాట్యశాలలయందుఁ, దూర్యత్రయంబులు దురఁగలింపఁ

తే. బ్రమద దిక్కాంత కెంగేలఁ బట్టియాడు, క్రొత్తగురివెందపూసలగుత్తివోలె
దివసకామిని ముఖలక్ష్మి తెలివి నొందఁ, బూర్వదిశయందుఁ గెంకరఁ బ్రొద్దువొడిచె.

వ. అయ్యవసరంబున. 140

శా. కాల్యాచారము లాచరించి కడఁకం గౌరవ్యశార్దూలుఁ డా
జ్జ్వల్యస్ఫూర్జితవస్త్రభూషణవిశేషస్ఫూర్తి యై పిప్పర
స్వాల్యాలేపనుఁడై విచిత్రబలశుంభద్భవ్యదివ్యాస్త్రసా
ఫల్యప్రాభవపోనిరూఢవిభవభ్రాజిష్ణుఁడై యున్నతిన్. 141

క. బలవదరినికరనిర్భర, బలసాదనబాహుదర్పబంధురలీలా
విలసనత యెసఁగ వచ్చెను, బలసూదనుసభకు భక్తిభావం బలరన్. 142

వ. వచ్చి సాష్టాంగం బెఱఁగినఫల్గును నఫల్గునవాత్సల్యహేలాసముత్సేకంబున గాఢ
గూహనసంభావితుం జేసి జంభభేది యతని నాత్మీయసింహాసనార్ధంబున నుపవిష్టుం
గావించి యిట్లనియె. 143

సీ. బాహాబలాటోపపరిపాటి మెప్పించి, పడసితి పీశానుపాశుపతము
సంగ్రహించితివి శస్త్రమ్ము లిమ్మడిగాఁగఁ, బురవైరికరుణ నిర్జరులవలన
నధికరించితి వస్త్రదాచార్యకంబునఁ, జతురంబు లగుదివ్యసాధనములు
కొఱత లేకుండఁ గైకొంటి కుంభజుచేత, నైజంబుగాఁ జాపనైపుణంబు

తే. పరశుపట్టిసముద్గరప్రాసముసల, ఖడ్గముఖచిత్రచంక్రమక్రమనిరూఢిఁ
గరము మేదిని సాటి నీ కరయఁ గలరె, శౌర్యమున నుగ్రభుజవీచి సవ్యసాచి. 144

శా. ఏరీ నిన్నెదిరింపఁగా జగమున న్వీరు ల్పరితాపోద్ధతిం
ధౌరంధర్యమునం బ్రభావమహిమం ధైర్యంబునం జాపలీ
లారంభంబున సాహసిక్యమున బాహాశక్తి దివ్యాయుధో
దార ప్రౌఢిమ దేవదైత్యనరగంధర్వాదిసంఘంబులన్. 145

క. నీ పని సేయ బలాఢ్యుఁడ, వీవిశ్వంబునను నీకు నెదు రెవ్వరు లే
రావంత యైన వదలకు, మేవలనను దేవవిప్రహిత కార్యంబుల్. 146
క. ఏపున భుజగర్వోన్నతి, ప్రాపున దీపింప నిట సుపర్వహితార్థం
బో పార్థ! చేయవలయును, నాపనిచినపంపుపంపున న్కార్యనిధీ. 147
చ. అలఘుబలు ల్నివాతకవచాఖ్యులు వీరలు ఘోరదానవు
ల్జలనిధిఁ గొంది నుండుదు రసాధ్యులు నిర్జరసిద్ధసాధ్యకుం
డలినరకిన్నరద్యుచరనాయకకోటికి మూఁడుకోట్లవా
రలవలనం గలంగెడు నిరంతరబాధల ముజ్జగంబులున్, 148
చ. మఱియును నెందఱేని నసమానబలు ల్సురలోకకంటకు
ల్తఱచుఁగ బాధ చేసెదరు దైత్యు లవధ్యులు నిర్జరాళి కే
ద్తెఱ నెఱయంగ వీరభవదీయశరార్చులపాలు సేసి యం
దఱ నుఱుమాడి యెంతయు హితం బొనరింపుము మాకు నర్జునా. 149
వ. అని సునాసీరుండు సమారాధనంబున. 150
క. తనతొడిగినభూషణంబులు, తనదుకిరీటము నభేద్యతరకవచంబుం
దనసుతున కొసఁగ గాండివ, ధనువున నగజయము గుణము దాఁచి కడంకన్. 151
క. హయము లనూరుసవర్ణము, లయుతంబు వహింప సూతుఁడై మాతలియు
న్నియమింపఁ దనరునరదము, నయదము నెక్కంగఁ బనిచి హర్షః బెసఁగన్ 152
తే. అసురలోకంబు నిర్జింప ననుపఁ బొంగి
సంగరోత్సాహ మెదలోన సందడింప
నడరు పెంపున నరుగునయ్యర్జునునకు
నిర్జరులు హర్షమున నిట్లనిరి కడఁగి. 153
సీ. ఈరథం బెక్కి మున్నింద్రుండు నిర్జించె, శుంభన్మహాదైత్యు జంభదైత్యు
నీశతాంగమున బర్హిర్ముఖేంద్రుఁడు ద్రుంచె, నాజిని స్తంద్రు వృత్రాసురేంద్రు
నీయరదంబున నెగిచె గోత్రవిభేది, పరిపంథిఘనమహాబలుని బలుని
నీతేరఁ గాదె మాయించె సుత్రాముండు, పాకదైతేయు నిర్భయసహాయు
తే. నీమహాస్యందనంబున నేపు మాపె, నముచిముఖదానవశ్రేణి నమరవిభుఁడు
నీవు మీతండ్రియట్లన నిఖిలదనుజపతుల నోర్వుము దీనిచేఁ బాండవేయ. 154
వ. అని పల్కి దేవసంబంధం బైనదేవదత్తం బనుశంఖం బిచ్చినం బుచ్చుకొని యర్జునుండు
మాతలియుందానును దద్రథాధిరోహణంబు చేసి నివాతకవచవధార్థం బతిరభసంబున
నరుగువాఁడు ముందటఁ గరిమకరకరకఠోరపూత్కారవారిధారాలవాసారపూర్యమాణ

గోదసీని రంతరాకాలసంపాదితోడుభ్రమంబుననమలడిండీరపిండఖండమండితా ఖండపాండుర్యధుర్యగోచిరనిశసాంద్రచంద్రికాక్రాంతదేశదిశాభాగంబును వితత విద్రుమలతానికుంజపుంజసమభిరంజిత ప్రదేశనిర్దిష్ట సంతతాదిష్ట చరమసంధ్యా విశేషరాగంబును గమతఝషకుళీరతిమితిమింగిలాదిసత్త్వసంపాతసంభృతాచ్ఛోది తధ్వనినిలీననిఖిలచేతనారవంబును దటవిధూతపాతవికిరదవిరళపరాగవినిభృతద్వి రేఫకుసుమమంజరీ విశాలలవలీలవంగలుంగలతాలాస్యవిభవంబును బత్త్రభూభృ దవిరతప్రచారాభిషవణంబును నమేయవాహినీవధూముఖప్రసక్తభూషణంబును నగుమహాసముద్రంబు డగ్గఱి తదీయోదరంబున. 155

చ. కనియెం బురంబు నమ్రమణికాంచనసౌధము నత్యుదగ్రసా
ధనము నసాధ్యశిల్పఘనదారుణసాలము నద్భుతైకస
జ్జనసముదగ్రఘట్టము విశాలతరాట్టము నుద్ఘటారిత
ర్జనము ననల్పగర్జనసురద్విపదుజ్జ్వలితంబు నిమ్ముగన్. 156

మ. కని యత్యుద్ధతి శంఖ మొత్తుటయు నాకంపించె ధాత్రీతలం
బనిలస్కంధము లేదు చిక్కువడియె న్యాదోనిధు ల్డిందె ఘూ
ర్ణనముం బొందె సురేంద్రలోకములు విన్నంబోయెం బాతాళము
ల్వినియోగంబులు దప్పె భూతచయము ల్వ్రీలె న్దిశాభాగముల్. 157

వ. ఇట్లు యుగవిగమసమయఘనఘనాఘనకఠోరదీర్ఘతరశలసహస్రభైరవం బగునమ్మ హారవంబు కర్ణశూలంబై తాఁకినఁ గనలి దానవులు హలముసలపరశుపట్టిసప్రాస పరిఘాముద్గరముసుండిదండకోదండకుంతకులిశభల్లభిందివాలశంఖశక్తి కర్తరీకతా రకతారలవిత్రతోమరత్రిశూలఖట్వాంగ చక్రచంద్రహాస మహాంకుశ గదాపాశ పాషాణప్రముఖంబులగు మహాస్త్రశస్త్రంబులు వహించి వికటగర్జారవభరంబున నంబరంబు పిక్కటిల్ల నొక్కపెట్ట యమ్మహానగరంబు వెడలి తదీయస్యందనంబుఁ జుట్టుముట్టి. 158

మ. ఘనశస్త్రాస్త్రమహాతివర్షము నొగి న్గర్జామహాడంబర
ధ్వనిసంవీతఘనాఘనౌఘనిపతద్ధారాళధారామహా
శనివర్షంబుల ద్వంద్వ మొందఁ బయిపై సంరంభశుంభద్గతి
న్వనధుల్ ఘూర్ణిల బిట్టు వాసవిపయి న్వర్షించె నొక్కుమ్మడిన్. 159

క. వాలికమెఱుంగుఁదూపులు, నాళీకోదరునిమఱఁది నలిదైత్యులపైఁ
గీలించెఁ బేరుపేర, న్వాలమునఁ బదేసికంకపత్రములు వడిన్. 160

మ. అలుకం దానవు లొక్కుయమ్మడి తదీయస్యందనోరుద్యుతి
స్థలనంబు న్సురసిద్ధచారణమహాశ్చర్యంబు గావించుచు

న్గలహాటక్షోణియు నాకసంబు దిశలుం గాండప్రకాండంబులం
గలయం గప్పి యదల్చి యార్చిరి సమాకంపింప భూతావళుల్. 161

తే. భయభరంబున వెలవెలం బాఱి రపుడు
త్రిదశసారథి ధృతి దప్పె తేర గడుప
భ్రమసియుండినం దాన సారథియు రథియు
నగుచుం బరిమార్చె నరికోటి నర్జునుండు. 162

క. నిర్జరసారథి యర్జును, దుర్జయవిక్రమము సమదదోహాలతయు దోః
ఖర్జాభరంబు సారథి, యూర్జిత్యముఁ జూచి మిగుల హర్షముఁ బొందెన్. 163

సీ. అసురు లుద్ధతిశూలహలభిందివాలంబు, లడరించి రడఁగించె నర్జునుండు
దైత్యులు దండించి దండశంకులశక్తు, లిగిడించి రడిగించె నింద్రసుతుఁడు
దైతేయు లేచి ముద్గరగదాంకుశములు, పఱపించి రదలించె ఫల్గునుండు
సురవైరు లల్కఁ దోమరకుంతగుణములు, సారించి రడలించె సవ్యసాచి

తే. కణయకంపరఖేటకక్రకచకులిశ, చక్రఖట్వాంగకుద్దాలచంద్రహాస
వివిధశస్త్రాస్త్రములు వైచి రవఘళించె, శుక్రశిష్యుల ద్రోణశిష్యుండు గెలిచె.

వ. అయ్యవసరంబున. 165

శా. జంభారిప్రభవప్రయుక్తనిబిడజ్యారావగంభీరసం
రంభభ్రామితగాండివప్రసరదస్త్రవ్రాతదీవ్యత్పరా
సంభిన్నాంగములై సురారితనువు ల్సంగ్రామరంగంబునం
గుంభద్రోణము లట్లు బిట్టు గురిసెం ఘోరంబుగా రక్తముల్. 166

క. చేయునది లేక దనుజులు, మాయాయుద్ధంబు సేయ మదిఁ దలఁచి ధృతిం
బాయక వైచిరి విద్యా, వైయాత్యము మించఁ బరుషవర్షాస్త్రంబుల్. 167

క. వడిఁ బాము ప్రేలఁగట్టిన, వడువున నలుగడల ముసరి వార్వాహంబు
ల్జడివడి కురియఁదొడంగెను, వెడవెలుపున లేక పాండవేయునిమీదన్. 168

మ. బలభిద్ధ్వంసివరంబునం గొనినదివ్యస్మారుతాస్త్రంబుచే
జలవాహంబులు పట్టఁజేసె నరుఁ డక్షయ్యప్రతాపంబున
న్గలయం గప్పిరి దారుణాశ్మముల నుగ్రస్వాంతులై యేచి దై
త్యులు పార్థుం గులిశాస్త్ర మేసి యవి తోడ్తోఁ ద్రుంచె నాతం డొగిన్. 169

చ. అనలసమీరణాత్మకము లైనమహాస్త్రము లేసి రుద్ధతిం
దనుజులు గాడ్పుతోఁ బెరసి నగ్గడ లొక్కట విస్ఫులింగము
ల్గవకనఁ గ్రాలఁ బావకశిఖ ల్వెస ముంచె సురేంద్రనందను
న్ననలి యతం డణంచె నవి గ్రక్కున వారిమహాశుగంబునన్. 170

చ. తిమిరమహాస్త్ర మేసి రణతీవ్రత సూపిరి దైత్యపుంగవుల్
క్రమమునఁ గప్పె నల్గడల గాఢమహోద్ధతిఁ జిష్ణుచీకటుల్
తెమలె దిశావివేకమును ధీరతయు న్వెస నెల్లవారికిం
భ్రమసి సురేంద్రసారథియుఁ బొఱఁగ వైచెఁ బ్రతోద మవ్వలన్. 171

క. రథ్యములు పరవనేరక, మిథ్యాభిమతంబు లయ్యె మెఱు మఱచి సమి
ద్రథ్యు ధనంజయుఁ గానక, తథ్యమునకు లేక యుండెఁ దత్సారథియున్. 172

వ. భయం బంది యర్జున యెటపోయె దని యెలుఁగెత్తి యాహ్వానంబు సేసి తొల్లి దేవాసురసమరంబు లనేకంబులు చూచితిం గాని యిట్టిభయోద్రేకజన్యంబు లగుజన్యంబులు సూడ వీరు వరజనితవీర్యదర్పితులు గావున వీరిసంప్రహారంబు ఘోరంబు అని పల్కిన మాతలి నూఱడించియించుక నేపు మద్భుజావిహారంబు చూడుమని ఫల్గునుండు.

శా. జంభద్వంసివరంబునం గనినయస్త్రంబు న్మహాసారముల్
శుంభద్విక్రమబాహుదర్పములు సంశోభిల్ల నేసెం దమ
స్సంభారం బడఁగన్ దిశ ల్విపులవైశద్యంబు నొందన్ సుర
ల్సంభావింప భయంపడంగ దితిజు ల్సంగ్రామరంగంబునన్. 174

మ. జవ మేపాఱఁగఁ గూలె దైత్యతనువు ల్సర్వంసహాపీఠిఁ బాం
డవగాండీవధనుఃప్రకాండభవకాండప్రస్ఫుటోచ్చండతాం
డవపాండిత్యవిశేషవిభ్రమకృతాడంబప్రతీకంబులై
యవనీంద్రంబులభంగి నింగి యద్రువన్ హాహానినాదంబులన్. 175

వ. ఇట్టినివాతకవచుల నిరవశేషులై మడసిన సంక్రందననందనుండు తత్పురంబులోని
కిం జని యంతయుం గనుంగొని మాతలి కిట్లనియె. 176

తే. కనకమయమహాట్టకుట్టిమకాంత మగుచు, వివిధమణిసౌధములును వస్తువులు గల్గు
నిప్పురంబునఁ గాఁపుండ కితర మైన, పురమునం దేల నిల్చె నిర్జరవిభుండు. 177

ఉ. నావుడు నిట్లనుం ద్రిదశనాయకసారథి నిర్జరేశ్వరుం
డీవనరాశిలోన సృజియించెను దైత్యభయంబుచేత దే
వావలి నుంద నిప్పుర ముదగ్రగతిన్ దనుసూను లంత రా
జీవభవుం బ్రసన్నునిగఁ జేసి మహాబలవీర్యవంతులై. 178

క. ఇందుండఁగ నింద్రాదిక, బృందారకవరులతోడఁ బెనకువ నెందున్
గ్రిందుపడకుండఁ దపమున, నందిరి వర మఖిలభువనహననోత్సుకతన్. 179

వ. కావునం దద్విజయార్థంబుగా విజయ నిన్ను వాసవుండు పనిచె, నిమ్మహాసురులు మరుద్గరుడగంధర్వసిద్ధసాధ్యుల కసాధ్యు లిట్టివారల విశ్రమంబునం జంపి పెంపు గాం

చితివి భవదీయసత్త్వసాహసంబులకుం గొలఁది యెక్కఁడి యని యని యర్జునుం బ్రస్తు
తించి మాతలి రథంబు గ్రమ్మఱించె. ఇట్లు నివాతకవచులఁ బరాభవించి భవ్యతేజో
దుర్నిరీక్ష్యుండై పాండవేయుండు మరలి వచ్చువాఁడు ముందట. 180

ఆ. వివిధవృక్షగుల్మవిస్తీర్ణమై కడుఁ, బొలుపు మిగులు నొకతపోవనంబు
నతివిచిత్రశిల్ప మగుపట్టణంబును, నుజ్జ్వలంబు లగుచు నున్నఁ గాంచి. 181

క. సురసారథి యిది యెవ్వరి, పుర మిమ్మహనీయఘనతపోవిపినం బె
వ్వరిది యిది నాదృష్టికి, హరహర యతివిస్మయంబు నాపాదించెన. 182

వ. అనవుడు నమ్మహాత్మునకు నాతఁ డిట్లనుఁ దొల్లి పులోమియు గోవికయు ననునసుర
కాంత లిత్తపోవనంబున దివ్యసహస్రవర్షంబు లత్యుగ్రనియమంబునఁ బద్మగర్భు
నారాధించి తత్ప్రసాదంబునం గనకమయంబై కామగమనం బైనయిప్పురంబునం
దనుసుతు లాహవంబునం ద్రిదశులఁ దొడరి వధ్యులు గాకుండ వరంబు వడసి రిది
హిరణ్యపుర మిందుఁ బౌలోమకాలకేయు లనునసురు లుండుదురు. వీ రింద్రాది
దేవతల కసాధ్యు లనిన నట్లేని యిప్పురంబుమీఁదం దేరు వఱుపు మని ఫల్గునుండు
మాతలిం బనిచిన. 183

సీ. సంవర్తమాతరిశ్వమనోహరరయమ్ము, లగునశ్వములును దీవ్యద్విభూతి
జిత్రచంక్రమము సుస్థిరనేమిఘోషంబు, నత్యద్భుతంబులై యంద మొంద
నమరారిపురముపై నాతఁ డుప్పరవీథి, నరదంబు వఱపిన నసురవరులు
వెస శతాంగములు షష్టిసహస్రకంబుతోఁ, బెరసి యొక్కుమ్మడిఁ బురము వెడలి
తే. యింద్రుఁ డనుబుద్ధి నల్కతో నింద్రతనయుఁ
దాఁకి రార్చుచు నతఁడును దారుణాశ్మ
వృక్షజన్యంబు లగుశస్త్రవితతి యేసి
తద్రథాళికి గతినిరోధంబు సేసె. 184

వ. వారును మాయాయుద్ధనిబద్ధబుద్ధులై తమపురంబులతోడ నంతరిక్షంబునకు నెగసిన
నిశితశరనికరపంజరప్రపాతంబున నూర్ధ్వగతినిరోధంబు చేసి వారి నేలంబడ నేసి
ఫల్గునుండు వీరి నన్యప్రకారంబున జయింపరా దని. 185

సీ. బ్రహ్మాదులును నాత్మ భావించి నిజముగా, నేదేవుమహిమంబు లెఱుఁగ లేరు
భూర్భువస్స్వర్ముఖంబులు లోకజాలంబు, లేదేవుకృపఁ జేర్మి నెలమి చెందు
భక్తి నేదేవునిపాదపంకజములు, దలఁచువారల కసాధ్యంబు లేదు
గజరాక్షసాదిమూర్ఖవ్రాతముల నెల్ల, నేదేవుఁ డడఁగించి యింపుఁ జెందె
తే. భక్తపరతంత్ర మేదేవుభవ్యమూర్తి, యట్టిదేవుని హృదయంబునందు నిలిపి

పాశుపతదివ్యబాణంబు పరమనిష్ఠఁ, దొడగి ప్రయోగించెఁ ద్రిదశశత్రువులమీఁద.

చ. శరభతరక్షుసింహకిటిసైరిభఖడ్గమహోక్షపక్షిక
జరసురయక్షరాక్షసపిశాచమహోరగభూతరూపము
లురగనరకిన్నరద్యుచరులొకభయంకరము ల్విచిత్రము
ల్వరుసను నుప్పతిల్లి వెసఁ బట్టి గ్రసించె సురారివీరులన్. 187

వ. ఇవ్విధంబున నర్జునుండు సురల నఱువదివేలరథంబులవారల హిరణ్యపురినివాసుల గీటడంచి వచ్చి వాసవునకుం బ్రణామంబు చేసిన నతండు నివాతకవచపౌలోమ కాలకేయాదిరాక్షసవధప్రకారంబు మాతలివలన విని. 188

క. సురలకు హిత మొనరించితి, ధర కేగుము నిన్నుఁ జూడఁ దద్దయు వేడ్కన్
ద్వరితపడుచున్నవారలు, హరివిక్రమ నీసహోదరాదులు పెరిమన్. 189

క. కదనమున నిన్ను దొడరంగఁ, ద్రిదశమరుత్సిద్ధసాధ్యదేవాదులలో
నెదు రెవ్వరు లే రనిన, న్నదపడి యొక మానవుండు ప్రతియే నీకున్. 190

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణుఁడున్ రణ
క్షోణి నవశ్యము న్భవదిషుప్రహతి న్మహితానుభావసం
ప్రాణబలాఢ్యు లయ్యు నిట రాక్షసు లట్లనె యోదు రంక న
త్రాణుల ధార్తరాష్ట్రుల దురంబున గెల్చుట నీకుఁ బెద్దయే. 191

వ. అని పల్కి వాసవుం డనేకమణివిచిత్రపీతాంబరాభరణంబులు గట్ట నిచ్చి యనిపిన నర్జునుం డవనీభువనంబునకు వచ్చి యగ్రజులకుం బ్రణమిల్లి తమ్ములం గౌఁగిలించుకొని ధౌమ్యాదులకు నమస్కరించి ద్రౌపది నుపలాలించి తక్కినవారలకు యథోచితంబు సేసి తనవృత్తాంతం బాద్యంతం బెఱింగించి. 192

క. క్రమమున సమస్తనృపుల, న్సమరమున జయించి యగ్రజన్ముని మాన్యున్
బ్రవిమలమతి ధర్మాత్మజుఁ, బ్రమదమున న్విశ్వ మెల్లఁ బాలింపించెన్. 193

వ. ఈయాఖ్యానంబు వ్రాసినం జదివిన వినిన నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియుం బుత్రపౌత్రాభివృద్ధియు నగును. 194

## ఆశ్వాసాంతము.

శా. వ్యాపారిప్రవరాన్వవాయగణనీయప్రౌఢిగంభీరస
ల్లాపానందితవిశ్వ! విశ్వభువనాలంకార! లంకాదిక
ద్వీపానీతసువస్తుతర్పితసమాధేయాఖిలక్ష్మాప! వి
ద్యాపాండిత్యవివేక! నిత్యకృతకృత్యా! బంధుచింతామణీ! 195

క. అర్థినికరార్థితప్రద! సార్థవహాకులాభినంద్య! సంచితధర్మా!
సార్థచరితార్థ! సంగర, పార్థ! యశోవర్ధనార్థ! పరమార్థనిధీ! 196

మాలిని. అచలవిపులధైర్యా హారివిద్వత్సపర్యా
ఖచరవినుతకీర్తీ కామినీహృద్యమూర్తీ
యుచితజనవివేకా యూరుజన్మప్రవేకా
సుచిరశుభవినోదీ సుస్థిరశ్రీప్రమోదీ. 197

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథ
నామధేయప్రణీతం బైనహారవిలాసం బనుమహాప్రబంధంబునందు సర్వంబును
సప్తమాశ్వాసము.

హారవిలాసము సంపూర్ణము.





చెన్నపురి: శ్రీరామ ప్రెస్సున ముద్రితము—1925.

# ఆంధ్రగ్రంథములు.



| | | ప్రతి1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము; శుద్ధప్రతి | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| అచ్చతెనుఁగు రుక్మిణీపరిణయము | ... | 0 | 4 |
| అధ్యాత్మరామాయణము | ... | 1 | 8 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | ... | 8 | 0 |

శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:—

అనేకవ్రాతప్రతులసహాయమున చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచికాలికోబైండు జేయఁబడియున్నది.

| | | | 1-కి రూ | |
|---|---|---|---|---|
| 7 సంపుటముల ప్రతి | | | 15 | 12 |
| 3 సంపుటముల ప్రతి | | ... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | | ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము | ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు | ,, | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము | ,, | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ,, | ... | 2 | 4 |
| శాంతిపర్వము | ,, | ... | 2 | 4 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | | ... | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటే సంపుటము | | ... | 6 | 8 |
| యుద్ధపంచకము | ,, | ... | 4 | 4 |
| శాంతిసప్తకము | ,, | ... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము, ... సూర్యనారాయణశాస్త్రి | | ... | 0 | 8 |

| | ప్రతి1-కి రూ. | అ. |
|---|---|---|
| అనంతునిఛందము, ఛందోదర్పణము ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |
| అప్పకవీయము (విమర్శలో) నున్నది ... | 2 | 6 |
| ,, విమర్శనమాత్రము ... | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలు కాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము ... | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము ... | 0 | 2 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు ... | 0 | 12 |
| ,, కాలికోబైండు ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు—టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటిపాపరాజప్రణీతము చక్కనికూర్పు ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతృచరిత్ర ... | 1 | 6 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... | 1 | 14 |
| కవిరాజమనోరంజనము ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు ... | 1 | [illegible] |
| కావ్యాలంకారచూడామణి, 7, 8, ఉల్లాసములు ... | 0 | 10 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువుకృతము ... | 0 | 6 |
| కౌసల్యాపరిణయము, శ్రీసుబ్బరాయకృతము ... | 1 | 4 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము ... | 0 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము ... | 2 | 4 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము ... | 1 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కని క్రొత్తకూర్పు ... | 4 | 0 |
| భోగినీదండకము ... | 0 | 1 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నారము ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| డిటో కాలికోబైండు ... | 2 | 2 |
| మున్నాళ్లముచ్చట, వేటూరి ప్రభాకరశాస్త్రిది ... | 0 | 4 |
| మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు ... | 0 | 10 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు ... | 3 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి నారాయణకవిప్రణీతము ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 2 | 4 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కని ప్రతి ... | 0 | 8 |
| ,, కాలికోబైండు ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |
| లంకావిజయము (రావణదమ్మీయము,) సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 8 |
| వసుచరిత్ర విమర్శనము, శ్రీ చినసీతారామస్వామిశాస్త్రికృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు, విపులసవా ... | 4 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మది ... | 1 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 12 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 5 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారిఇంగ్లీషుతో | ... | 1 | 4 |
| డిటో (3000) ఆంధ్రతాత్పర్యముతో | ... | 3 | 8 |
| వైశ్యపురాణము | ... | 1 | 4 |
| వైజయంతీవిలాసము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| ,, నాగరాజామాత్యకృతము | ... | 0 | 12 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 0 | 12 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవిప్రణీతము | ... | 0 | 6 |
| శ్రీనాథునిదీక్షినాటకము | ... | 1 | 2 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది. క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| ,, కాలికోబైండు | ... | 1 | 6 |
| సారంగధరచరిత్రము, చేమకూర, వేంకటకవికృతము | ... | 0 | 10 |
| సానందోపాఖ్యానము, శ్రీశివరామకవి విరచితము | ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్న సైజున ముద్రించినారము, టీక, వివరణము మిక్కిలివిపులము, ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది, సాధారణప్రతి | ... | 2 | 8 |
| డిటో మేలుప్రతి కాలికోబైండు | ... | 3 | 8 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 14 |
| హరవిలాసము | ... | 1 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము | ... | 2 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
... చెన్నపురి, ఈ.